# శ్రీ కన్యకాపరమేశ్వరి చరిత్ర



గ్రంథకర్త :

సువర్ణ ఘంటాకంకణ బిరుదాంకిత

సంస్కృతాంధ్ర పండిత

**బండ్ల సుబ్రహ్మణ్య మహాకవి**

## -: నివేదనము :-

ఆస్తిక నాస్తికవాదద్వయ మాదినుండి వచ్చుచుంట సత్యము. సృష్టిస్థితిలయములకుఁ బంచభూతములే హేతువులనియుఁ, దదన్యమేదియు లేదనియు నమ్మియున్న వారి వాదము నాస్తిక వాదము. ఒకానొక క్రమబద్ధముగా నీ ప్రకృతి యింత జాగరూకతతో నడచుటకుఁ బాంచభౌతిక శక్తులే కారణములా? వీనికి మించిన సర్వ సత్త్వ సమన్వితమైన, బాహ్యదృష్టి కగోచరమైన, శాశ్వతమైన యొకయద్వితీయ దివ్యశక్తి యున్నదనియు, నాశక్తియే భగవత్స్వరూపమనియు ఆస్తికుల వాదము. ఈ వాదోపవాదములు బాహ్యవస్తు నిదర్శన మాత్రమునఁ దేల్చఁదగినవి కావు. ఈవాదములను విమర్శించి సత్యజ్ఞానానందముఁ బొందవలయునన్న మానవున కంతర్వాణి, యంతర్దృష్టి యవసరము.

ఈ యంతర్వాణి, యంతర్దృష్టి యనునవి శమదమాది సద్గుణముల వలన నిత్యనిర్మల నిష్ఠా మహిత మనస్సుతో సత్యము నన్వేషించుటవలనఁ గ్రమక్రమముగా నేర్పడి దేవత్త్వమునకు దారితీయును. ఆమార్గమున గమించి యోగసిద్ధిపొందిన పరమహంసకుఁ దత్త్వజ్ఞాన క్షీరసాగరమును నిష్కళంక హృదయముతోఁ దఱచిన క్రాంతదర్శి యగు విద్వత్కవీంద్రునకు మాత్రమే యా దివ్యశక్తి స్వరూపము మానసికముగ నర్థమగును. చర్మచక్షువునకు గోచరింపకపోయినను స్పర్శజ్ఞానమాత్రమునఁ బవను నునికి యెట్లు సత్యమని నమ్ముచున్నారమో యట్లుగుర్తింపఁదగినవిషయమిది. అనఁగా ననుభవైకవేద్యము.

ఈవిషయము నాధారముగఁ జేసికొనియే కర్మసిద్ధాంతమును, దానిమూలమునఁ బ్రాణికోటి పునర్జన్మాదులంగూర్చి పెక్కుపరిశోధనలు నాదికాలమునుండియు జరుగుచునే యున్నవనుట సత్యదూరము కాఁజాలదు. కాలక్రమమున భగవల్లీలల యందాత్మప్రత్యయము గలిగి దుష్టశిక్షణ శిష్టరక్షణకొఱకుఁ బరాత్పరుం డవతరించుననియు

బ్రగాఢవిశ్వాస మాస్తికులకుఁ బెఱిగినది. అట్టి నమ్మకమువలననే యిట్టిచరిత్రలు పుట్టినవి. సాకార నిరాకారోపాసనలకుఁ దావేర్పడినది.

భూమండలమందలి యన్ని దేశములను జాగరూకతతోఁ బరిశీలించినచో ఆస్తికులసంఖ్యయే యత్యధికమని స్పష్టముగాఁ దెలియుచున్నది. చివఱకాటవికులలోఁగూడ ఆస్తిక్యము ద్యోతకమగుచున్నది. విష్ణుమూర్తి దశావతారములలో నొక యవతారముగ నిర్ణయింపఁబడిన బుద్ధుఁడుగూడ దేవుని సహజస్వరూపమును గూర్చి సుస్పష్టముగఁ జెప్పఁజాలకపోయినను, మోక్షమార్గగామి కుండవలసిన సద్గుణములన్నియుఁ దెలుపుచుఁ దద్ద్వారమున ఆస్తికున కుండదగిన మంచి లక్షణములన్నియు బోధించి మానవాతీతమైన యొక మహత్తరదివ్యశక్తియున్నదనియే విశ్వాసముచూపెను.

లోకమున నొకఁడౌనన్నది మఱియొకఁడు గాదనుట పరిపాటియైనది. ఇది వాదభేదములకొఱకా, సత్యనిర్ణయము కొఱకా యనునది విచారణీయము.

"దైవమ్ మానుషరూపేణ" యను పెద్దల వాక్యార్థమును గమనించియే లోకము బుద్ధుని నవతారమూర్తిగా గుర్తించినది. తద్భావమే యితరులయందును వర్తించునని గమనించునది.

> "యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
> అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్"

అను గీతావాక్యముగూడ నీ భావమునే బలపఱచుచున్నది.

ప్రకృతి పరమాత్మయను రెండు విభిన్నశక్తుల సమ్మేళనము చేతనే యీ బ్రహ్మాండమంతయు నేర్పడినదనియుఁ బ్రకృతి స్త్రీరూపమనియుఁ బరమాత్మ పురుషాకృతి యనియు సృష్టికిం బూర్వ

మేకైక శక్తిగనున్న పరబ్రహ్మమే యైచ్ఛికముగా నిట్లు స్త్రీ పురుష రూపంబుల ధరించి సృష్టికాధారమయ్యెననియుఁ దత్త్వవిదులమతము.

పార్వతీదేవ్యంశంబునఁ గన్యక జన్మించెనని తత్పురాణములు చెప్పుచున్నవి. కన్యకాపరమేశ్వర్యాలయములు మన తెనుఁగునేల నాలుదెసలఁ బ్రకాశించుచున్నవి. వాసవి తెలుఁగుగడ్డపైఁ బుట్టి పెరిగినబిడ్డ. కావున, నిది యాంధ్రదేశమున జరిగిన చరిత్రము. ఉత్తమోత్తము లాత్మగౌరవము నిలుపుకొనుటకొఱకుఁ బ్రాణపరిత్యాగమునకైన వెనుకంజ వేయరను విషయ మీకథవలన మనకుఁ దెలియుచున్నది. మానవకోటిని సాధ్యమైనంతవఱకు ధర్మపథమున నడిపించుటకొఱకే యుత్తమగ్రంథములు వెలువడుచున్నవి. అందువలననే లోకంబున వానికి స్థిరత్వమేర్పడినది.

శక్తివంచనలేక పనిసలుపుట మానవధర్మమగునుగాని సకాలమునఁ దత్ఫలమనుభవించుట, యనుభవింపఁజేయుట యనునవి కేవలము తత్కారగతముగాక మనుష్య నిర్ణయాతీతమైన విషయములని లోకజ్ఞులందురు.

సుమారు పదుమూఁడువత్సరములకు మున్ని కన్యకాపరమేశ్వరీ చరిత్రరచించితి. నాటినుండియు దీని నచ్చొత్తించు నవకాశములభింపలేదు. కారణము లనేకములున్నను నాంధ్రమహాభ్యుదయ (అమరజీవి జీవితచరిత లేక ఆంధ్రరాష్ట్రావతరణము) అను గ్రంథము నాంధ్రలోకమున కత్యంత శీఘ్రముగ సమర్పింపవలయునన్న కృషియే దీని యాలస్యమునకు ముఖ్యహేతువు. శివానుగ్రహమున దాని ప్రథమభాగము ముద్రింపబడి తదావిష్కరణ మహోత్సవాదులు సముచితానంద జనకములుగ జరిగిపోయినవి. అనంతర మీగ్రంథ ముద్రణాదికృత్యము లిట్లుపూర్తిచేసి సహృదయుల కందఁజేయుచున్నాఁడ.

త్రిలింగదేశ వ్యవహారసిద్ధంబగుభాష దేశ్యంబని వ్యాకర్తల నిర్ణయము. అనఁగా మూఁడు శివాలయముల మధ్యప్రదేశమున నివసించుచున్న ప్రజలచేఁ దొలుదొల్త మాటలాడఁబడిన భాషయని వ్యాకరణవేత్తల విశ్వాసము. ఆమూఁడు శివాలయములే మన శ్రీశైలము, దాక్షారామ భీమేశ్వరము, కాళేశ్వరము. త్రిలింగ శబ్దభవమే తెలుఁగని వ్యాకృతిశాస్త్రజ్ఞుల మతము. త్రిలింగశబ్దమునకే మూలాధారమైన శివాలయ త్రయమున నతిప్రఖ్యాతివడసిన, పెక్కుపురాణముల వర్ణింపఁబడిన శ్రీశైలక్షేత్ర మొండుగావున నా శ్రీగిరి మల్లికార్జునస్వామికి నా యీకృతి సమర్పింపఁ గృతనిశ్చయుండ నైతి. తెలుఁగుదేశమునఁబుట్టి తెలుంగుబాస తల్లి బాసగా నభ్యసించి తెలుఁగునఁ గబ్బములు రచించినందుల కిట్లంకిత మొనర్చుటే సుకృతమని తలంచితి.

ఈ గ్రంథ మింతచక్కఁగా నచ్చొత్తించుటకు నాకు సాయపడిన శ్రీ అదుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారికిని, శ్రీ కన్యకా పరమేశ్వరీ చిత్రముయొక్క "బ్లాకు" ను సంపాదించిపెట్టిన శ్రీ గొల్లపూడి రాధాకృష్ణయ్య శ్రేష్ఠిగారికిని, సారస్వతనికేతన ప్రింటింగుప్రెస్ వారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

గ్రంథకర్త.



# అంకితము

ఈశా నిర్జిత దుర్జన
యీశానా పాత్రమిద్ది యే నతిభక్తిఁ
శ్రీశైలమల్లికార్జున
నీ శ్రీపాదముల చెంత నిల్పితిఁ గొనుమా.

ఎందఱొ కావ్యకన్యకల నిచ్చిరి యింకను నెందు కందువా
పందలు వేలుగా నృపులె వారక పెండిలి యాడుచుండ ని
న్నందఱు రాజమౌళి వని యాడుచు నుండిరి దివ్యరూప! యా
చంద మెఱింగి మాసుతకుఁ జాలిన వాఁడ వటంచు నెంచితిఁ.

గంగయు భ్రమరాంబయు నా
కుంగల రింకేల యనెదె కోరి వరించెం
బంగరు బొమ్మిది గొనుమిఁక
శృంగార కలా విలాస! శ్రీగిరివాసా!!

# మాతాపితృ వందనము

ఇమ్మాడ్కిం దలితండ్రు లీ తనువు నాకీయంగ దా వాణి రూ
పమ్ము ల్సత్కృతు లాంధ్రభాష రచియింపం దన్మహాభూతి ని
త్యమ్మౌ శాను భజింపఁగల్గితి నిఁ కాత్మ స్తోతలర్పింతు నా
వమ్మా వేంకటసుబ్బయాహ్యుల కమందానందముం బొందుచున్.

ఓమ్

# శ్రీ కన్యకాపరమేశ్వరీ చరిత్ర

శ్రీరమ్యంబగు నాంధ్రభూమికి ఫలశ్రీఁ గూర్చు గోదావరీ
తీరప్రాంతపవిత్రభూతలసరిత్తీర్థాన్వితారామశృం
గారాగారసువర్ణరత్నబహుభాగ్యస్థానమై రాజిలుం
బెనుంబెంపున దానధర్మధృతులం బెన్గొండ కన్పండువై. 1

కాంచనగోపురాగ్రమణికంజవినిర్మితనీలబంభరో
దంచితసౌధరాజము లహర్పతిందలపించుచుండు రా
యంచలవోలెఁ దజ్జనులు రాజిలుచుంద్రు విలాసలీలఁ బ్రా
పంచికసౌఖ్యసంతతు లపారములై మురిపించుచుండఁగన్. 2

ఆ బృహద్గిరిపురవర మఖిల జనుల
వృత్తులు సమదృష్టిఁ గనఁగ వృద్ధి నందుఁ
బురుషకారంబునకు లోటు పొరయకుంట
కఱ వనెడి మాట కచ్చోటఁ గఱవు గల్గు. 3

అప్పురి నలువలంకుల నలరు సుగంధలలితపుష్పలతాఫల భరితవృక్షశోభితోద్యానవనములు నందనవనమును గ్రిందుసేయు. తత్పరిమళమిళితమందమారుతము విం దొనగూర్చు. అన్నగరవర నరబృంద మన్యోన్యసుహృద్భావభరితమై యలరారు. నూత్నవైజ్ఞానికపురోగమన మనన్యసాధ్యము. సత్కార్యతతికి సజ్జనాళి కడక విడక నడక సాగింపఁ దదభ్యుదయ మింపు నింపు. అట దైవభక్తి యమోఘము. అప్పుర వైభవ మెంతని వర్ణింపఁగలము. 4

ఈశ్వరుఁ డాపురాన నగరేశ్వరనామమునం జెలంగె స
ర్వేశ్వరుఁ డౌట నెవ్వ రెపు డేక్రియఁ బిల్చినఁ జెల్లుఁ జెంత వి
శ్వేశ్వరి వింధ్యవాసినిగ నేర్పడె భక్తులఁ బ్రోవ వీరలే
విశ్వసనీయమూర్తులని వేడ్కమెయిన్ భజియింతు రెల్లరున్. 5

విశాలసితసాలవిలసితంబు, మహోన్నతశిఖర కనత్కనకకలశ శోభితంబు, కాంచనఘంటికాకలితశిల్పకళాలలితోత్తుంగధ్వజవిరాజితంబు, గరుడాశ్మవినిర్మితతోరణంబు, నవరత్నఖచిత సింహద్వార బంధురంబు, వజ్రకుట్టిమదీపితంబు, చక్రాంగరథాంగాదినిఖిలజలఖగ సంకలితపద్మాకరపరిశోభితంబు, నిత్యాభిషేకారాధనాహ్లాదకరంబు, ప్రతీందువాసరభక్తిభావభరితభజనకాలక్షేపభవ్యంబు, శివదర్శన కుతూహలాయత్తచిత్తభక్తాగ్రగణ్యసమాగమంబు, నై యయ్యాలయం బాత్మానందంబుఁ గలిగించు. ప్రమథగణనందీశ్వరగజాననపార్వతీ సమేతుండై పరమేశ్వరుండు నివసించు నక్కోవెల పరమపావనమై యలరారు టత్యుక్తిగాదు. కార్తీకపూర్ణిమా మహాశివరాత్ర్యాదిపర్వ దినంబుల సహస్రదీపారాధనజరుగు. అన్నగరేశ్వరున కెట్టయెదుట 6

భూతిఁ దాలిచి కుంకుమ బొట్టు పెట్టి
కూర్మి సుతునట్లు యెదురుగాఁ గూరుచుండి
నిశ్చలసమాధినిష్ఠలో నిలిచియున్న
మౌనివలె నంది శివునిపై మనసునిల్పు 7

ఆర్తరక్షకుఁడిట హరుఁడమరె ననుచుఁ
బవనుఁ డెఱిగించుచున్నాఁడొ ప్రజల కనఁగ
కనక ఘంటికారవళులు కడలుకొనఁగఁ
జారుతరరత్నముల ధ్వజస్తంభ మలరు. 8

శుక్రవారమ్మునాఁడు విశుద్ధభక్తిఁ
బార్వతీదేవి మృదుపాదపద్మములకుఁ
బుణ్యవనితలు కుంకుమపూజచేసి
పరమశుభములు నిత్యంబు వడయుచుంద్రు 9

కోనకమలాఖ్య లక్ష్మితోఁ గూడి యందు
హరి జనార్దనుఁడను పేర నలరుచుండు
దుర్గ యపవర్గదాయిని భర్గురాణి
దివ్యతరమైన పూజలఁ దేజరిల్లు 10

పరమానందముతోడన్
వరభక్తులు వచ్చి నిచ్చ వారక కొలువన్
దురితంబులఁ బొలఁగించుచుఁ
బరగును తత్పురమునందు భైరవు గుళ్ళున్ 11

అచట మును తమ్మికొలనిలో నద్భుతముగ
నెక్క కాడన మూఁడుపూ లొప్పె నంట
యేమహాత్ములు దీక్షతో నెంతకాల
మటఁ దపంబొనరించిరో యరయ వశమె 12

మఱియు నిరంతరనిర్మలజలపూరితసురదీర్ఘికంబోలు గౌతమీనదీజలంబులకలిమి నాకలోకంబుంబలెఁ, గోటికింబడగలెత్తి రత్నరాజిచే రాజిలు నాగర్భశ్రీమంతుల కునికిపట్టగుట నలకాపురివలె, సకలమణిగణమున కాలవాలమగుట వరుణపురము భాతి, నిరంతరమంగళదేవతానివాస భాసమానమగుట వైకుంఠంబు రీతి, గౌరీశంకరాలయప్రభాపరమశోభాసమన్వితమగుటఁ గైలాసంబు రేఖ, మనోహర నృత్యగానకళాలోలుర కాటపట్టగుట గంధర్వనగర మట్లు, నిత్యనూతనవస్తునిర్మాణచణులకుఁ బుట్టినిల్లగుట సత్యలోకము చాయ నొప్పునప్పుర మతిరమణీయమై యలరారు టరుదే! 13

సరిగ నెలమూఁడు వానలు కురియుచుంట
వసుధ కడుసారవంతమై పొసఁగు కతన
నాఁడు తత్పట్టణమునకు నాల్గు వెసల
సర్వవిధసస్యములు పండు సక్రమముగ 14

పెద్దలు గీమున న్సరగఁ బ్రేమ సమస్తము దీర్చి దిద్దుచుం
దద్దయు జాగరూకులయి తా రనుపం గడుసంతసంబుతో
నొద్దిక నొండొరుం గలిసి యున్నతభావములన్ వెలార్చుచున్
ముద్దులుగుల్కుచుం బడికిఁ బోవుచునుందురు బాలబాలికల్ 15

తోవలు రాజమార్గములు ప్రోవులు ధాన్యములున్ ధనమ్ములున్
గోవులు కామధేనువులు కోడెలు నందులు చెట్లు కల్పముల్
తావులు గంధయుక్తములు తామరచెర్వులు మానసమ్ములా
దేవుని సేవచేఁ బురము దివ్యతరంబుగ వెల్గు టబ్రమే? 16

ఆయూరన్ వసియించు వైశ్యకులం దత్యంతవిశ్రాణన
న్యాయోపార్జితవిత్తభోగరతుఁ డార్యారాధనాబోధన
శ్రీయోగాన్వితుఁ డాఢ్యధర్మయుతుఁ డాశీర్వాదలబ్ధప్రభా
మాయాపాయవిదూరుఁ డాప్తుఁడు కుసుంభశ్రేష్ఠి వర్ధిల్లెడిన్ 17

ఆతని ధర్మపత్ని కుసుమాంబ పతివ్రత భర్తృసత్కృపా
నీత కళాసమేత సువినీత పునీత సుజాత యంచు వి
ఖ్యాతిని గన్న ధన్య శుభకాంక్షలతోఁ బతి కన్ను సన్నతో
నీతిగఁ గాలముంగడపు నిత్యము స్త్రీలకు మేలుబంతియై 18

భవబంధంబుల పాటెఱింగిన మహాభక్తుండు తచ్ఛ్రేష్ఠి దు
ర్వ్యవసాయంబుల పొంత పోవక సదా వాణిజ్యగోరక్షణ
వ్యవసాయాదులఁ జక్కఁ జూచుకొనుచున్ భార్యాసమేతుండునై
శివపూజామృతపానమత్తమతియై చెన్నొందు మిన్నందుచున్ 19

వరలె సదా హరపరసుం
దరతరసుమనోబ్జుఁడగుచు నరనాయక కి
న్నరనాయక సురనాయక
వరు లరమరలేక యతని భక్తి నుతింపన్ 20

ఇష్టాపూర్తంబులు నర
దృష్టాదృష్టార్థదస్థిరీభూతములన్
దృష్టిం దద్ధితబుద్ధిన్
సృష్టినిభబుధాళి చెలిమి సలుపు సతమ్మున్. 21

ఆతండు కోటీశ్వరుండుగాన రాజభోగంబు లనుభవించుచు సదాశివభక్తియుక్తుండుగాన నాత్మయందు ముక్తసంగుండగుచు గృహస్థాశ్రమధర్మంబులు సక్రమంబుగ నిర్వర్తించుకొనుచు, రాజయోగి నా నొప్పె, మఱియు, 22

ఇలువేలుపు నగరేశ్వరుఁ
గొలుచుటలో శ్రేష్ఠుఁడతఁడు గుణిమణి సతముఙ్
వలయు ఫలమేమొ పూజల
ఫలదానము సేయుచుందురి భార్యాభర్తల్. 23

కలిమిని గర్వమ్మొక్కింఁగమిఁ
బిలిచిన కార్యములఁ బిన్నపెద్దలఁ బెలుచం
దలలో నాలుక వోలెను
మెలఁగెడి దంపతులఁ జూచి మెత్తురు జనముల్. 24

ఆతనువుల్ ద్వయమ్మయిన నాత్మ యొకండని తోఁపఁజేయు చా
పూతచరిత్రులాల్మగలు పూవును దావియుఁ బోలె నుండి రే
పాతకమో కటా! కడుపు పండదు వర్షము లెన్ని దొర్లినఙ్
నాతికి నంతకంటె వ్యసనం బొకడుండునె యెంత గల్గినఙ్ 25

ఒక్క దినమునఁ బతిచెంత నొదిగి నిలిచి
యేలకో నాథ! సంతాన మీయఁ డయ్యెఁ
బరమశివుఁ డంచు నా సాధ్వి పరితపింప
నతఁడు సతిమతిఁ గల బాధ నాత్మ నెఱిఁగి. 26

ప్రియసీ, 27

అల పిపీలకాతర్పణ మాచరించి
దేవతాప్రతిష్ఠల సల్పి దీనులఁ గని
దానధర్మము లెన్నియోఁ దగనొనర్చి
నార మైనను మనకోర్కి దీరదయ్యె. 28

తరుణీ! యీవిషయాభిలాషమెయి నాత్మం గొంత చింతించి నే
నరయం జాలక దైవయత్న మిఁక గుర్వాజ్ఞం బ్రవర్తించుటే
వెర వంచెంచితి వారిజీరి తనుజాప్తిం గోరి మేలేరి యే
సరణిం బోవఁగ నొప్పు నా తెలుఁగు విశ్వాసంబుతోఁ బోఁదగుఙ్. 29

కావున నమ్మహనీయుని
రావించెద నిప్పు డనుచు రయమున మిత్రుం
గేవల భక్తిం బనిచినఁ
బావనహృత్పద్మ్ముఁడగుచుఁ బనివినె నతఁడుఁ 30

అట్లు పనివిని యనూచానుండు ధరామరాన్వయపయః పారావారరాకాసుధాకరుండు నిర్మలత్రియీధర్మకర్మాచరణాభిరతుండు, ప్రిజ్ఞానంబ్రిహ్మ, అహంబ్రిహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మాబ్రిహ్మేత్యాది మహావాక్యార్థవిదుండు, ప్రాతస్స్నానయమనియమ సమాధినిష్ఠాగరిష్ఠుండు పరిధీకృతజ్ఞానతేజః ప్రిభావుండు గురువర్యుం డన్వర్థకాభిధానుండయి యలరారు భాస్కరాచార్యుం గని నమస్కరించి వచ్చినపని వాకొని తోకొనిరా, 31

మొ్రిక్కి యుచితాసనంబిచ్చి మ్రోల నిలిచి
గురువమని యాజ్ఞ దంపతుల్ గూరుచుండి
యడుగకుశలమ్ము సెప్పి మహాత్మ మాకు
దీపమిడు దిక్కెదవు త్రోవ దెలియదయ్యె. 32

ఆచార్యవర్య. 33

మీరు ధీరులు సత్కవుల్ సారధర్మ
సత్య మెఱిఁగిన వారలు సరగ మాకుఁ
బుత్రిసంతాన మొదవెడి పుణ్యకృతులు
బోధసేయుఁడు సంతృప్తి వొందునట్లు. 34

అనిపల్కిన వారల ముఖావలోకనమ్ము సేసి తలవంచి తనమనమ్మున నీతల్లి యనసూయ యరుంధతి సుమతి సావిత్రివంటి మహాసాధ్వీమతల్లి- 35

పిల్లికి బిచ్చముఁ బెట్టని
యిల్లాండ్రికు సంతు నిచ్చి యెముకెఱుఁగని చే
చల్లని యుల్లము గల సతి
కొల్లఁడు ప్రజ నీయ దేవుఁ డోపియు నకటా! 36

అని యనుకొని- 37

స్వరపరీక్షచేసి జ్యోతిషచక్రమ్ము
ప్రశ్న దృష్టి నాత్మఁ బాఱఁ జూచి
పరిసరమ్మునం దుపశ్రుతి గమనించి
భద్రరీతి మౌనముద్రఁ బూని. 38

అలరి భాస్కరుఁ డాత్మలో హరుని దలఁచి
పుత్రకామేష్టి చేసి సత్పుత్రవరులఁ
బడసె దశరథుఁ డది మీరు భక్తిఁజేయ
సంతతి లభించు నని చెప్ప సంతసించి. 39

ఆ గురునానతిన్ సమిధ లాజ్యము దర్భలు స్రుక్స్రువారణుల్
త్యాగకళార్హరత్నధనధాన్యఫలాంబరభూషణాదులున్
వేగమ గూర్చి యొక్క శుభవేళ మహాక్రతుదీక్షఁ బూనెఁ ద
ద్భాగ చయమ్ము ఋత్విజులు భద్రముగా నడిపించుచుండఁగన్. 40

అగ్ని ముఖమునఁ దద్దవి స్సారగించి
యఖిల దివ్యులు సంతృప్తు లగుచు నుండ
హరున కష్టమూర్తుల నొకం డగ్గి యగుటఁ
బరమశివుఁడును బ్రీతుఁడై కరుణ గలిగి. 41

అగ్గిరిజాసతీసహితుఁడై సవనంబును మెచ్చి శ్రేష్ఠికిం
దగ్గయుదాత్తసంతతి నుదారత నీయఁ దలంచి వెంటనే
యగిని బిల్చి యాత్మఁ గల యంశముల న్వివరించి తెల్పఁ గా
దగ్గపనింగ్రహించి తలఁ దాల్చె మహేశ్వరు నాజ్ఞ వహ్నియున్. 42

గుర్వాపాదితసత్రము
సర్వాంగీణమ్ముగాగ సలిపెడి వేళన్
సర్వార్థసిద్ధి నీఁదగు
సర్వేశ్వరు కరుణ వొందఁ జాలుట యరుదే. 43

అట్లు పరమేశ్వరుని యాజ్ఞ నంది శ్రేష్ఠి
దీక్షకు న్మెచ్చి దివ్యదీధితులతోడ
నగ్నిదేవుండు ప్రత్యక్షమయ్యె నంత
నతని నుతియించి రాల్మగ లమితభక్తి. 44

అత్తఱి యజ్ఞపురుషాకృతి ధరించి యప్పుడ వికసించిన కెందామర నడుమ వెలుగొందు సూర్యభగవానునింబలె జ్వాలాళి మధ్యంబునఁ బ్రకాశించుచున్న యా దివ్యమూర్తిం గని యందఱానందభరితులైరి- 45

కాంచనకిరీటకుండలోదంచితుఁడయి
కుండమున నిల్చి శాంతదృక్కులు రహింప
వహ్ని దివ్యప్రసాదసంభరితమైన
స్వర్ణపాత్రిక శ్రేష్ఠికిఁ జక్క నొసఁగె. 46

అట్లొసంగి కృశానుఁడదృశ్యుఁడైనంతఁ గుసుమసెట్టి తత్ప్రసాదంబు సాదరంబుగ నిజసతీమణి కిడ నద్దాని కనుల కద్దుకొని జగన్మాతాపితలగు పార్వతీపరమేశ్వరుల నతిభక్తి నాత్మఁదలంచికొని- 47

సవనసంలబ్ధ దివ్యప్రసాద మమృత
సారముంబలె కుసుమాంబ యారగించె
నంత జన్మంబు పూర్తియౌటరసి శ్రేష్ఠి
సంతసమ్మున గురువర్యు సత్కరించె. 48

కాంచనచేలంబులు, కాశ్మీరశాటులు, రతనాలపావలు, బహువిధ వస్తువాహనంబులు, నదీమాతృకంబులగు కేదారంబులు, [illegible]ధేనువుంబోలు గోవులు, విద్వద్వరేణ్యులగు గురువర్యుల కత్యంతభక్తిపూర్వకంబుగ దక్షిణతాంబూలసమేతంబుగ సమర్పించి శ్రేష్ఠి తుష్టినందె. పిదప- 49

ధన కనక మణి విభూషణ
ఘన గోభూ దాన ధార కడలిం జేరం
గొని ఋత్విజు లాదత్తిని
గొనియాడిరి నరులు సురలు- గూరిమి వినఁగన్. 50

వచ్చిరి బ్రాహ్మణోత్తము లపారముదంబునఁ గాన్కలీయఁగా
నిచ్చిరి దీవనల్ పలుకులే కనకంబుల మించునేమొ యా
సచ్చరితుండు శ్రేష్ఠి కడు సంబరమున్ వెలిబుచ్చె హెచ్చుగా
మచ్చిక మీఱ నౌనవును మాటకు మూట సమాన మౌనొకో. 51

ఎత్తిన పళ్ళెము దింపక
యుత్తమ పద్ధతుల షడ్రసోపేముతగా
నత్తఱి నెందఱు వచ్చినఁ
దత్తజ్జనమునకు నన్నదానము చేసెన్. 52

ఫలభాగ్యాన్వితయజ్ఞనిర్వహణవిశ్వాసాత్తసంతృప్తుఁడై
లలనారత్నముఁ గూడి యాతఁడు మహోల్లాసంబుతో నుండఁగా
నెల దప్పెం గళలొప్పె నప్పడతి కెంతేఁ దోఁచె బయ్యంకలుం
దొలి జన్మంబునఁ బూజసేసిన మహాత్ముల్ వ్యర్థులై పోదురే? 53

బడలిక జడతయు హెచ్చెం
గడుఁ బుల్లని పండ్ల మీఁదఁ గాంక్షలు పెఱిగెన్
వెడ యోకరింత లడరెను
నడ లెంతయు మందగించె నారీమణికిన్. 54

మును లేని కోర్కె లేవో
మనమునఁ బొడసూపుచుండె మాటలు దగ్గెం
గునుకుటయు నరుచి యెచ్చెం
దనువున నొక వెల్లఁదనము దలసూపె వెసన్. 55

కల చుట్టలు సూడిద ల
గ్గలముగఁ గొనిరాఁ ద్యజించి కాంక్షించు వనిం
గెళకుల గట్టులఁ బాదులఁ
గల నిద్దపు నీలమృత్తికాశకలములన్. 56

జనవంద్యుఁడు శ్రుతిహితముగఁ
దనబంధుల హితులఁ బిల్చి తచ్ఛ్రేష్ఠి దగన్
వనితల గానముతోఁ బా
వనముగ సవనముగఁ బుంసవనము న్సలిపెన్. 57

కోర్కెలను సస్యములు పండ కుసుమ కపుడు
మాసములు నిండఁ బ్రాగ్దిశామహిళయందు
నొక్కదినమున రవిచంద్రు లుద్భవించి
నట్లు జన్మించి రాత్మజుఁ డాత్మజయును. 58

చల్లనిగాలివీచె, బుధసంతతి కుల్లము పల్లవించె, ను
త్ఫుల్లసరోజసౌరభము ముమ్మరమయ్యె గ్రహానుకూలముం
గొల్లగఁ దోఁచెఁ జూచె ద్రుమకోటి దిశ ల్వెసఁ దెల్వి మించె నా
పిల్లలు పుట్టినట్టి శుభవేళ జగం బొకశోభ నందెఁగా! 59

వృద్ధపుణ్యస్త్రీలు వచ్చి యాశుభవార్తఁ దెలిపినంత బ్రసవ
వేశ్మంబున [illegible]త్సం తానముఖావలోకనంబునఁ బితౄణామోక్ష
మంది పూర్ణ[illegible]దయంబునం బొంగు తరంగిణీశుని విధాన నా
ధన్యుఁడు [illegible]ష్టి సంతోషసాగరంబున మునిఁగి తేలుచుఁ
బరిసరమున గల బాలబాలికలకు ద్రాక్షా, ఖర్జూర కదళ్యాది
బహువిధ ఫలంబులు పంచిపెట్టి పేదలకన్నదానంబు సేసె. అనంతరంబు

జాతకర్మాదికృత్యముల్ జక్కఁ జేసి
శక్తి కొలఁదిగ దానముల్ సలిపిరి నిజ
పేదసన్నిధి పెన్నిధుల్ వెలసినట్లు
సంతసంపడి రెంతెంతొ సతియుఁ బతియు. 61

విరూపాక్ష వసు వాసవుల కృపాకటాక్షవీక్షణమ్ముల జన్మిం
చిన వారను విశ్వాసవిశేషమ్మునఁ బుత్రపుత్రికలకు విరూపాక్ష
వాసవీ సమాహ్వయమ్ములిడి యత్యంతవాత్సల్యమ్మునఁ బెంచు
చుండ నందు వాసవి,
62

వచ్చిరానిమాట లుచ్చరించెడి వేళఁ
జిలుక యట్లు బదులు పలుకు వేళఁ
దల్లిదండ్రులెంత యుల్లాసపడుదురో
చెప్పఁగలఁడె యావిశేషుఁడైన. 63

పండువెన్నెలరేల నవ్వాసవి తన
సఖులతోఁ బంతమాడుచు సంతసమున
గజ్జెలందియలుం ఘల్లుఘల్లుమనఁగ
ముద్దుముద్దుగ బాఁగిలిమూఁత లాడు. 64

గౌరి యని శంకరుండని కడుముదమున
బొమ్మలకుఁ బెండ్లి సేయు చాయమ్మ తోడి
వారలును దాను వియ్యాల వార మనుచుఁ
గూర్మిఁ జెలులకు గుజ్జెనగూళ్ళు వెట్టు. 65

అంతఁ బంచవర్షప్రాయమ్మున నంతర్ముఖుఁడగు భాస్కరాచార్యుల విద్యాగురువుగ నియమింప వార లమ్మనీషి దయావిశేషమ్మున నవిరళకృషిసల్పి యల్పకాలమం దనల్పవిద్య లభ్యసించుచుండ, వసంతసమాగమంబున సహకారముంబలె నవయావన శోభామహిమ నపూర్వకళాకలితురాలైరి. 66

మఱుఁ డను చిత్రకారుఁ డసమానకళాకమనీయదృక్ప్రభా
సరణి వినూత్నయౌవనరసంబున ముంచిన కాల తూలికన్
సరగున స్నిగ్ధతాగరిమ సంధిల రంగులు దిద్ది తీర్చెనా
సురవరు లద్భుతంపడఁగ శోభిలెఁ దన్మృదుదేహగేహముల్. 67

వారల వాసవి వాహిని
తీరెఱుఁగఁ దరంబె తెలివితేటల విద్యా
సారసువిచారచణయయి
శారద నా నొప్పి జగము సన్నుతి వడసెన్. 68

పూవు పుట్టఁగనే తావి పొల్చు నట్లు
జనని గర్భంబునుండి పుట్టినది మొదలు
ధన్యురాలగు నా దివ్య కన్య యందుఁ
గొదువ లేకుండ సుగుణము ల్గోచరించె. 69

బాల్యశిశిరాంతసముదిత
కల్యాణవినోదసూచికాకుసుమరమా
లౌల్యానుకూల్యనందన
తౌల్యవిలాసమున నామె తనువన మలరెన్. 7

నిటలాక్షు నిల్పి మనమున
నటరాజప్రతిమ యెదుట నాట్యము సల్పున్
కుటిలాలక యక్కన్నియ
పటుతరదీక్షానిబద్ధ బంధురమతియై. 71

ఐహికాముష్మికసుఖంబు లందు నెందు
రెండవది గురుతరంబని నిండుమనసుఁ
గీర్తికరకృత్యతతి నామె కీలుకొలుపుఁ
గానఁ బేరిడి రొగి కీర్తికన్య యనుచు. 72

అపు డొకనాఁటి సంజ విజయధ్వని కాండకటాహభేదిగా
విపుల వడంక ధూళి వినువీధి ఘనాఘన మట్లు గ్రమ్మఁగాఁ
దపను రుచిన్ విరాజిలు పతాకపటంబులు గాలిఁ దూలఁగా
నిపుణుల దృష్టి తద్దిశకు నివ్వెఱతోఁ బఱువెత్తిపోవఁగా. 73

విలసితవిక్రమాన్వితపవిత్రచరిత్రసుధాంశువంశని
ర్మలయశఃకీర్తివర్ధనుఁడు రాజమహేంద్రపురాధినాథుఁడై
యలరెడి విష్ణువర్ధనధరాధిపుఁ డాత్మబలాళి గొల్వ ది
క్కులను జయించి వచ్చె నటకున్ జను లందఱు సంభ్రమింపఁగన్.

వచ్చి పురాంతికసీమం
బచ్చికపై సేన నిలిపి పరిసరవనముం
జొచ్చి తన తీవి గాంచి వి
యచ్చరు లచ్చెరువుపడ విహారము సలిపెన్. 75

డేరాలమర్చి భటు లట
దారుస్తంభములఁ బాతి తగినటు వరుసం
దేఱుల దరిఁ గరిహరులను
వేఱుగ బారులుగఁ గట్టివేసిరి వేడ్కన్. 76

జలజాప్తుఁ డస్తమించెం
గలనాదవినోదవిహగగానము మించెన్
నలుదెసఁ జమూసమూహము
వెలిఁగించెం గాగడాలు వెలుఁ గలరించెన్. 77

అర్మిలి విశ్వకర్మ నిమిషార్థమునన్ సృజియించి యిచ్చె నీ
ధర్మపురంబు నాఁ దనరె భవ్యముగా నట భాగ్యభోగ్యముల్
శర్మదమయ్యె రాజునకుఁ జాలినవా రెటనున్న సౌఖ్యముల్
నిర్మలధర్మకర్మరతి నేర్పున వచ్చి భజింపకుండునే. 78

రాజు గుడారము చుట్టును
రాజిల్లెను దివ్వె లమితరమణీయముగాఁ
తేజముమై మణిగణ మహి
రాజగు వాసుకిని గొల్చు రహి రంజిల్లన్. 79

కసిదీఱఁ దనయసి కసిమసంగిన కథల్
చెలి యంగములు వొంగ చెప్పువారు
కాయమ్ము గాయమ్ము గా మాఱఁ దీఱిన
పురుషసింహుల కీర్తిఁ బొగడువారు
పులి నాకి విడిచిన పులిబిడ్డ దరిఁజేరి
గంటి గంటికిఁ గట్లు గటువారు
కృతకృత్యులకు బహూకృతు లిచ్చు రారాజు
తెలిపె నాఁడని జ్ఞప్తిఁ దెచ్చువారు

ఒండు రెండు దినమ్ముల కూరి కేఁగి
దారపుత్రాదులను జూడఁ గోరువారు
నగుచు నెవరిలోకము వారి దనఁగఁ గనఁగఁ
బొంగెఁ దద్వాహిని విజయపుష్కరమున. 80

అంతం గొంతవడి కెల్లరు సాయాహ్నిక కృత్యంబులు నిర్వర్తించుకొని యిష్టాహారంబులఁ దృప్తులై రి. ఆనృపాలకంఠీరవుండు కుమారకంఠీరవాద్యమాత్యవర్యులం గూడి పటకుటీరబహిరంగణమున నుచితాసనాసీనుఁడై యుండ, 81

కరదీపిక కరవాలము
కరము కరమ్ములను వెలుఁగఁ గావలి యోధుల్
దిరిగిరి "గస్తీ" నిస్తుల
నరవర పరమానురాగ నందితమతులై. 82

ఉల్లోకయశుఁడు విద్యా
త్పల్లాపుఁడు నృపుఁడు సైన్య సభఁ గాంక్షింపన్
మెల్లఁగ సచివుఁడు కారణ
మెల్ల నరసి భటున కాజ్ఞ నీ వెనువెంటన్. 83

వినువీధి గంట మ్రోగెను
జనపతి శాసనముఁ దలఁచి సైన్యము చేరెన్
వినయమున లేచి ప్రెగ్గడ
మనుజాధిపు నాజ్ఞ నిట్లు మాటాడె సభన్. 84

ఆంధ్రవీరవతంసములారా! యసహాయభుజావిజృంభణమున నపరధనంజయుం డనఁ దగినవాఁడును జాళుక్యవంశవర్ధనుండును నగు విష్ణువర్ధనమహీవల్లభుఁడు సకలదిగ్జైత్రయాత్రాసమయమున మీరుచూపిన శౌర్యసాహసములకు విధినిర్వహణమునకు నెంతయు సంతసంపడి తా నాఁడె కరిగినంత మున్ను దానుడివినట్లు తత్తదధికారోచితముగ మిమ్మెల్లర సత్కరింపఁ గుతూహలాయత్తచిత్తుఁడై యవ్వార్త మీకు శీఘ్రమ విన్పింప నీసమావేశంబుఁ జరిపించె. మన మహారాజు మహోన్నతవంశమున జన్మించిన మహాపురుషుఁడు. తనపూర్వులవలె నున్నతాశయములుగల యుదారమూర్తి. కావున నిట్టి విశిష్టసమయమున నిజసత్సంకల్పంబు వెలిబుచ్చె. ఇత్తఱి మన కెల్లరకుఁ దద్వంశాభివర్ణన మత్యంతావశ్యకంబు గాన సావధానులరై వినుండు. 85

ఊర్ధ్వలోక నివాసులై యుజ్జ్వలబల
శాలురై కఠోరనియమశక్తియుక్తు
లై వరలు దేవదానవు లావి ఘోర
మృత్యువు జయించు మార్గము లెన్నొ వెదకి. 86

కడకు మంథరగిరి మంథదండముగఁ జక్షుశ్రీవశప్రభువగు వాసుకి మంథరజ్జువుగ శ్రీహరి కమఠరూపమునఁ దదద్రిధరుఁడుగ నమృతార్థులై దేవదానవు లత్యంతదీక్షతో క్షీరసాగరమును మథింపు చుండఁ గల్పవృక్షకౌస్తుభకామధేన్వాదులతోఁ దన్నవనీతంబు చందంబున నిందిరాసుందరీసహోదరుఁడుగ సుధాకరుఁ డను నన్వర్థాభిధానముతో నెవ్వఁడు జన్మించెనో, లక్ష్మీనారాయణుల కల్యాణకాలమున మఱఁదియై శ్రీమహావిష్ణువునకుం బాదప్రక్షాళన మెవ్వం డొనర్చెనో. నిజపీయూషకిరణప్రకరములతో నోషధులఁ బోషించుచు నోషధీశుఁ డను విఖ్యాతి నెవ్వఁ డందెనో యట్టి రేరాజు వంశకర్తగా వెలయుటంజేసి జగత్ప్రసిద్ధి వడసిన చంద్రవంశనామ మెఱుంగనివారు లేరు. 87

అక్కులంబున దుష్యంతుఁ డనెడి రాజు
కణ్వసుతఁ బెండ్లియాడఁ గాఁ గలిగె భరతుఁ
డతఁడు రారాజుగా దేశ మఖిల మేల
భరతదేశాఖ్య మనభూమి వడసె యశము. 88

ఆవంశంబునఁ బుట్టిన
పావని శంతనుఁడు ధర్మబంధురమతియై
భూవలయ మేలెఁ గీర్తికిఁ
దావలముగఁ బ్రజకు శాంతిదాంతు లెసంగన్. 89

అతనికిం గుమారరత్నముగ జన్మించి పితృమనోవాంఛాఫలసిద్ధ్యర్థము రాజ్యము మన్మథసామ్రాజ్యము తృణప్రాయముగాఁ బరిత్యజించి సహోదరులను దత్పుత్రులను సంరక్షించి భారతవీరశిరోమణి యని ప్రఖ్యాతిఁ గాంచిన భీష్ముఁడు మహామహిమాన్వితుఁ డనుట సత్యసత్యము. 90

ఎవఁడు కనువిప్ప జగమెల్ల నెఱియు ననుచుఁ
దన మఱందిని రక్షించుకొనెడి కోర్కెఁ
బ్రతిన విడనాడి చక్రము వట్టె గృష్ణుఁ
డతని నుతియింప నెవ్వరి కలవియగును. 91

కురుపాండవులు బాల్యంబాది పరస్పర భేదభావంబులఁ బ్రవర్తించుట జ్ఞానవృద్ధులు గ్రహించి తఱి యెఱిఁగి జాతిరత్నముల వంటి నీతుల నుపదేశించిరి. అవి యన్నియు బధిరశంఖాన్యాయ మయ్యె. కడకు విదుర గాంగేయ ద్రోణ కృపాచార్యాదు లెందఱు చెప్పినను వినక — 92

అయ మిదికాదునాక పరమార్థ మెఱుంగక దాయభాగని
ర్ణయమున దారిఁ గానక రణం బొనఁగూర్చిరి ధార్తరాష్ట్రు లా
శయములు వ్యర్థమై కడకు చచ్చిరి; పాండవ పక్షపాతియై
జయ మొనగూర్చెఁ గ్రీడి కలచక్రి సమస్తము నిర్వహించుచున్. 93

కురుక్షేత్రసంగ్రామంబునఁ బాండవ పక్షంబునఁ బ్రధానయోధుఁడుగా విజయుఁడు విజయంబుఁ గాంచుట జగద్విదితము. అగ్గాండీవి ప్రతాప మద్వితీయము వర్ణనాతీతము త్రిలోకాధిపతియగు మహేంద్రుని నిర్జించి యఖండ ఖ్యాతిఁ గాంచిన ఖాండవమును దహించి వీతిహోత్రున కర్పించె. చతురర్ణవీవృత భూభాగంబునంగల మహీపతుల నవలీల జయించి ధర్మరాజుచే నిర్విఘ్నముగ రాజసూయంబు సేయించె పురుహూతునిచే నాహూతుఁడై యమరపురి కరిగి తత్పురణంబున నేకైకవీరుఁడుగా నెదుర్కొని నిర్జరులకేని దుర్జయులగు నివాతకవచకాలకేయాది రక్కసుల నొక్కుమ్మడి నుక్కుమిగిలి యుక్కడంచె మహా ప్రోత్సాహంబున నగజు నాజ్ఞావిశేషంబున ననన్యసామాన్యామోఘతపం బొనర్చి దైవపరీక్షకాగి శాంబరీభిల్లునిచే బాశుపతాస్త్రంబు వడసె. ఉత్తర గోగ్రహణకాలమున నుత్తరుఁడు తత్తరపడుచున్నను, దనకుఁ దగిన సారథి కాకున్నను, నసహాయ శూరుఁడుగ భీష్మ ద్రోణ, కృప కర్ణ శల్యాది మహాయోధుల నొర్చి యాల మరలించి విరటునిచేఁ బూజింపఁబడె. కడకు భారతయుద్ధమున నతిరథ మహారథులఁ బరిమార్చె. అట్టి యర్జునుని పుత్రుండే యభిమన్యుఁడు. అతఁడు— 94

భారత ఘోరయుద్ధమున బాణకృపాణగదాది విద్యలం
గౌరవపక్షయోధులకుఁ గాలు విధంబున గుండెగాలమై
క్రూరవిరోధివర్గమును గూల్చి పితౄణముఁ దీర్చికొన్న య
వ్వీరశిరోమణిప్రభలు వెల్గవె నల్గడఁ గీర్తిమూర్తితో. 95

ప్రజ్ఞ దనరఁగ ద్రోణుఁడు పన్నినట్టి
తమ్మిమొగ్గరమునఁ జొచ్చెఁ దండ్రి లేమి
సమయ మని యెంచి కౌరవసంఘ మొకఁడ
ధర్మముగఁ జంపె నాతని మర్మ మెఱిఁగి. 96

అయ్యభిమన్యుని కుమారుఁడగు పరీక్షిత్తునకు జనమేజయుండు జన్మించె. అజ్జనమేజయునకు శతానీకుండును నవ్వానికి క్షేముండును నాతనికి ధర్మశాలియు, నతనికి విజయార్కుఁడును, నవక్రపరాక్రమోపేతుండగు నవ్విజయార్కునకు విక్రమార్కుఁడనందగు మన విష్ణువర్ధనమహారాజుగా రుదయించి బాల్యమాదిగా 97

వేదధనుర్వేదవిద్యల గ్రహియించి
విద్వత్కవీంద్రులఁ బిలిచి గౌర
వించి పోషించి కొల్వించి కీర్తింగాంచి
సామంతరాజుల చర్య లరసి
చతురంగబల మతి సామర్థ్యమునఁ బెంచి
యంతట దిగ్విజయంబు సేయఁ
బ్రస్థానభేరీరవంబున దిక్కులు
బీటలువారగా వెడలి యిట్లు

నలుదెసలు గెల్చి వచ్చి యీనాఁటి కిచట
నిల్చె మనరాజు దైవాజ్ఞ నిల్పినట్లు
యింక నిటనుండి యింటికి నేఁగఁ గలము
కటకమున సర్వసౌఖ్యముల్ గలుగు మనకు. 98

విచ్చిన హల్లకం బనఁగ వీరుల నెత్తుటఁదోఁగు మేనితోఁ
జిచ్చఱపిడ్గుఁ బట్టఁగల చేవ వెలార్చి స్వరాజ్యసౌఖ్యసం
పచ్చయవృద్ధికై తనదుప్రాణము లర్పణచేసినట్టి యా
సచ్చరితాగ్రగణ్యులను సంస్తుతిసేసెదఁ దొల్త భక్తితో. 99

వీరగౌరవ మనుపేర జరుగనున్న ఘన సన్మానమునకు మీరెంతయుం బాత్రులు. ఎట్లన- 100

తనువు ధనంబు ప్రాణములు దా నుదయించిన పుణ్యభూమికిన్
వినయముతోడ నీఁ గలుగు వీరుఁడు పూజ్యుఁడు ముజ్జగంబులం
దనెడి బుధోక్తి సత్యముగ యాత్మ నెఱింగిన మీరు శూరులై
ఘనవిజయంబుఁ గూర్చితిరి కావున మెత్తురు మిమ్ము సత్ప్రజల్ 101

అనిమొన వైరివీరవరు లందఱుఁ గాంచఁగనస్త్రశస్త్రసా
ధనముల నిల్చి గెల్చి వసుధాధవుకీర్తియు మీయశంబు స
జ్జనులు నుతించునట్లు నిజశౌర్యముఁ జూపిన యోధులార! మీ
మనములు తృప్తినొంద బహుమానము లిచ్చు నృపుండు హెచ్చుగన్.

లలితసాహిత్య సౌహిత్యములఁ జెలంగు
నధిపు మధురాతిమధుర భావాళిసాఁగి
శౌర్యరస భాసురస్థితిఁ జౌకళించి
సాగితిమి నాఁ డపూర్వపుజైత్రయాత్ర. 103

అనుకొన్నచోట్ల విజయధ్వజంబులునాటి నేఁడు జయజయ ధ్వానములతో నిలుసేరుచుంటిమని యెల్లఱకు హృదయానందముఁ గలిగించి నాఁటి సమావేశము ముగించె. ఆ రేయి సుఖసుప్తిం బొందిరి. అనంతరంబు— 104

కౌఁగిటం జిక్కి రవి యుషఃకాంతతోడఁ
గళలఁ దేలుచుఁ గులికెడి కాలమందు
మబ్బుదొంతర వారల మాటుపఱచి
తనదుశిరమున మెఱపును దాల్చియుండె. 105

ఆమెఱుఁగు మానవాకృతి నందఁ దలఁచి
యాతపంబున ఫలసిద్ధినంది శ్రేష్ఠి
కాంతకుం బుట్టెఁ గాఁబోలు కాకయున్న
కన్యకాకాంతి నుడుగులు గ్రక్కు నొక్కొ. 106

అపుడు రేయెల్ల విరహిణి యయ్యెననుచుఁ
గంజకాంతను గరములఁ గౌఁగిలింపఁ
గనకకాంతులు జిమ్ముచుఁ గర్మసాక్షి
యెడుగుజ్జాల యరదంబు నెక్కివచ్చె. 107

పతివిరహబాధయట్లుండఁ బ్రిక్కనున్న
కమల కాపుర మత్యంత గౌరవమున
నుంటఁ దిలకించి కువలయ మోర్వలేక
యెడదఁ గుములుచు మోమును ముడిచికొనియె. 108

అట్టి సూర్యోదయ సమయమున— 109

ఆ కన్యాతిలకంబు దివ్యకుసుమసాధారామసీమారమన్
సాకల్యంబుగఁ గాంచి తత్సరసి స్నానంబాడ సారంగముల్
సాకూతంబుగఁ బల్కు పల్కుల రసాస్వాదంబుఁ గావింప న
స్తోకానందముతోడ నేఁగె వని కంయున్ నెచ్చెలుల్ తోడ రా. 110

ఏఁగి యట నందలు వేళాకోళంబుగ బాలలీలాలోలలై పరి
వృతపూగపున్నాగకదళీనాళికేరాళి యగు కేళాకూళిం డగ్గఱి తత్తీర
చతుర్దిశాశోభితగజాకారనీరయంత్రశుండాగ్రనిర్యత్తుషారాసారవారి
ధారావలోకనకుతూహలంబున నొక్కెడానిం జేరి, 111

జలయంత్రంబులఁ గీలు త్రిప్పుచు యథేచ్ఛన్ నెచ్చెలిం గూర్చుచున్
గలహంస ల్దరిఁ జేరఁ జేకొని సరఃకంజంబులం జేర్చుచున్
జలజాతమ్ముల నమ్మి జిమ్మినటు పెల్చం జిమ్మగా నేర్చుచున్
జలకేళిన్ లలిఁదేలి యంత నటకున్ సామీప్యకుంజంబునన్. 112

సితలతాంతలతావిలసితహరితవ
సనమును ధరించి రత్నభూషలను దాల్చి
పునుఁగు జవ్వాది కస్తూరి బొట్టుఁ బెట్టి
నర్మగర్భోక్తులాడు కన్యాలలామ. 113

మారుని గజ్జెల కటారి
తీరున నా సురభిళాంగి దిద్దిన రూపం
బారసి సత్యంబుగ వే
నోరులు గలవారికైన నుడువన్ వశమే. 114

అత్తఱి సఖీజన మధ్యంబున వాసవి యున్న యుక్కెం గనుం గొనఁ జుక్కలలోఁ జందురుండు జ్ఞప్తికి వచ్చుచుండె. అంతనక్కాంత సముచితోల్లాసంబున. 115

తామరాకును దొన్నెగాఁ దగ నొనర్చి
కుంజకుంజంబునకుఁ జని కొసరి కొసరి
నవనవోన్మేషపుష్పముల్ భవుని భక్తిఁ
జెలులతో ముచ్చటాడుచుఁ జిదుమఁ దొడఁగె. 116

చిదిమి మదనారి పూజా
సదనమ్మునఁ బదిలపఱచి సఖులుం దానున్
ముద మొదవ గోష్ఠి సలిపెడి
యదనున జేగంట మ్రోఁగె నర్చనఁ దెలుపన్. 117

వారిం దోకొని తత్క్రతు
భార మ్మొక కొంత మోసి వాసవి శివపూ
జారతి భారతి భాతిన్
హారతి గీతములు పాడె నానందముతోన్. 118

ఆగీతామృతరాగరంజితకళాహ్లాదామృతాంభోధిలో
వాగీశుండును దేలునా పసుని జెప్పన్ భోగిరాడ్యోగియౌ
నాగోత్రపత్రిభ నిల్పఁగా సతియె నిట్లాయింట జన్మించి యా
నాగాలంకృతు సేవసేయునని కాంతల్ నిచ్చలున్ మెచ్చెడిన్. 119

పిదప నానుగుణఖని చతురాస్యలగు వయస్యల యందొక్కతె యీతెఱంగునఁ బరమకల్యాణప్రాప్తి రస్తనఁ బ్రసాదంబు స్వీకరించి భుజించి సౌధోపానసరణిం జని శశిశిలాకీలితచంద్రశాలాతలసౌవర్ణడోలాలాలితయగుచుఁ దాంబూలచర్వణంబు సేయుచు సమస్యాపూరణంబులఁ బొడుపుకథల వినోదించుచు విహరించుచున్న యవసరమ్మున రాజాగమనంబు విని— 120

అవనీభూషణవజ్రభాసితహర్మ్యహర్మ్యరారాడ్విటం
కవితానోత్తమశృంగసంగతసఖీగర్వాణనారీమిళ
న్నవశోభావిభవాభిరామ యగు కన్యామేనకాజాత తా
నవితోర్వీతలరాజశేఖరదివ్యకౌముత్తమై యుండఁగన్. 121

వేఁబోక లేచి నగరికిఁ
దాఁబోకట నిలువ నెఱఁగి ధన్యులు వైశ్యుల్
రాఁబోవు దారి నెఱుఁగక
రాఁ బ్రార్థనఁ జేయుఁ జనిరి రారాజునుచున్. 122

అట్లుప్రార్థించి కోట్యానివచ్చి మహోన్నత భూరి వరణముతో, దివిజధునీజలకణార్ద్రవినిర్మలశిఖర రాజితో, విశాలవజ్రకుట్టిమములతో, గరుడాశ్మవినిర్మితతోరణతతులతో, నవరత్నఖచిత మనోహరసింహద్వారముతో, బహువిధవర్ణబంధురగవాక్షములతో, విచిత్రకథావిధానవిద్యోతమాన మణిమయ చాంపేయ సాలభంజికలతో, శుకపికశారికానికర వాసయోగ్య పంకజరాగరంజిత విటంకములతో, సుదారదారుశిల్పకలావిలాసముతోఁ, జతుర్దిశాపరివేష్టిత పుష్పఫలభరితోద్యానవనాళితో, కుసుమవిసరమధుపానమత్తమధుకరప్రకరఝుంకారావ్యక్త మధురగానములతోఁ, జంద్రకాంతశిలావేదులతోఁ, కుసుమితలతావితాన నికుంజపుంజములతో, స్వేతగరుత్కారండవబకచక్రవాక బలాకకోయష్టిక జలకుక్కుటాద్యనేకవారి విహంగసంతతి సంశోభిత నద్మినీప్రభాసంకలిత పద్మాకరమ్ములతో, సముజ్జ్వలితనీహారనిభపయఃకణగణ విరాజిత నానావిధ జలయంత్రవితతితోఁ గమనీయసితవితాన ముక్తాహారయుత శీతల కాయమానములతో, రతనాలకంబళ్ళతో, నరుణరాంకవములతో నలరారు జగన్మోహనమను సౌధరాజమ్ము రాజునకు విడిదిగనేర్పరచి బృహద్గిరిపురవరమును దిలకింప దయసేయుఁడని వేఁడుకొని తదంగీకారమునుబొంది యమందానందకందళితహృదయారవిందులై 123

ఆజానుబాహు వగు నా
భూజానికి నుపవలిచ్చి మొక్కి సరగఁ ద
దాజ్ఞానుమోదగౌరవ
భాజనులై వచ్చి చాటఁ బంచిరి ప్రజకున్. 124

స్వాగతమును దెలుపు చలువ పందిరి వేసి
యడుగులకును మడుగు లమరఁ జేసి
పుర మలంకరించి భూపు రాకఁ దలంచి
యెదురుచూచుచుండి రెల్లవారు. 125

నానాద్యుతిమద్వస్తు
శ్రీనిధులై వీధులెల్లఁ జెన్నలరారన్
జానపదజనవినోదా
నూనకళాకౌశలమ్ము నూల్కొనెఁ బెలుచన్. 126

అంకుశ మూని మావటి జయాంకములన్ ధరియించి దంతికిం
జంకొక యింత లేక తల జాలరులన్ సవరించి కొమ్ములం
బొంకముగా మణుల్ వెలుఁగు పుత్తడి గొట్టములన్ బిగించి యి
ర్వంకల రత్నఘంటికల రాజిలు కక్ష్యలఁ జక్కఁజేయఁగన్. 127

బల్లెముల నెత్తి యిర్వురు
మల్లుర వలె నున్న భటులు మదకరిబరులం
దల్లంత దాపు నిలువఁగ
సల్లలితవిహారహారి సంపద పెరుగన్. 128

లలనలు హారతు లిడ రో
వెలఁదులు నృత్యములు సేయ వేత్రధరు ల్బా
రులు దీర్ప నేర్పు కలిమిం
బలువిధవాద్యములు మ్రోగె బంధుర ఫణితిన్. 129

నూఱు బారలవరకును బాఱు తీరి
యాశ్వికాగ్రిణు లిరుదెస నమరియుండ
నడుమ శ్రేణిగ గజసేన నడచుచుండ
రమ్యదృశ్యమునా నొప్పె రాజు రాక. 130

పథమున కనువగు పంక్తుల
పథకక్రమ మమరఁ బ్రధన బహుశిక్షాప్తిన్
రథగజతురగప[illegible]తులు
ప్రథితగతిన్ సాగె వెనుకఁ బ్రభు నాజ్ఞమెయిన్. 131

# శ్రీ కన్యకాపరమేశ్వరీ చరిత్ర

విజయధ్వానమ్ములఁ బురిఁ
బ్రజ యెదురుగ వచ్చి తేని వారణమునకున్
స్రజ మీయ నద్ది ప్రభునకు
నిజభక్తినొసంగెఁ గరము నేర్పు పొసంగన్.

దినదినరణవితరణసా
ధనధనమతశత్రుమిత్రధన్యుం డితఁడే
కనుఁడని తద్జ్ఞులు తెలుపం
గనె నత్దెస జనము ముదము కడలుకొనంగన్.

హత్తిన హేళిఁ బొత్తొదవ [illegible]త్తఱిఁ పత్త్రపమత్తకా [illegible]
చిత్తజరూపు భూపుఁ గనఁ జెచ్చెఱ భూరిశిరోగృహంబులం
దొత్తుగఁ దత్తఱంపడుచు నుండి రపూర్వవిలాసదృష్టులం
గ్రొత్తొకవింత పొంఁతయొకరోఁ తను సామెత నిక్కమౌఁ గదా!

ఉల్లము పల్లవింప నయనోత్పలముల్ వికసింప వెల్లి పె
న్వెల్లువ నా జనింపఁ [illegible] వేడుక చిర్పుగ వంకురింపఁ ద
త్పల్లవపాణు లాత్మభవపాశవశంవదసూక్తియుక్తిసం
ధిల్లఁగ రాజు రాజు గను తీరునఁ జూచి రగాధగాథలన్.

జననాథాగ్రణి పట్టణంబున మహాసౌధాగ్రిసంచారసం
జనితాపూర్వవినోదదృగ్మహిమ బశ్యద్భామలంగూడి కాం
చనపాంచాలికలన్ జయింపఁగల చంచచ్చంచలాదేవియో
యన రాణించెడి కీర్తికన్యఁ గని మోహావేశుఁడై యాత్మలోన్

వల్లీవల్లరిదేహ యీసతి కళల్ వాగీశభోగీశులే
నుల్లేఖింపఁగలారె? యాత్మసుఖసఖ్యోల్లాసహాసోల్లస
త్సల్లాపోల్లలపుల్లపద్మదృగయన్ జావాహిరిం జూడ నా
యుల్లం బల్లన మోహవాహమున నేపో లాహిరిం బొందెడిన్.

ఔరా! యేమి యీ తరుణీమణి యనన్యసామాన్య సౌంద ర్యాతిశయము. ముజ్జగంబుల గాలించిన నిట్టి జగన్మోహనాంగి దృగ్గోచరమగుట యసంభవము. బ్రహ్మనిజసృష్టికలాకౌశలమంతయు నొక్కసారిచూపఁగోరి చంచలాకాంచన కంజకింజల్కాది మనోహర పదార్థములన్నియు నొక్కచోటఁ జేర్చి యిట్టి సతిని నిర్మించెనా? ఈ లలితాంగిని మహేంద్రుఁడు దిలకించినచోఁ దనసింహాసనమున నిజపార్శ్వమున శచీదేవిని గూర్చుండనిచ్చునా? గిరీశుండు చూచినచో గంగను నెత్తికెక్కించుకొనునా? పార్వతీదేవి కర్థశరీర మిచ్చునా? విష్ణు వీక్షించినచో లక్ష్మీదేవిని దన విశాలవక్షస్స్థలమున నిలుపు కొనునా? పంచశరుఁడు రతిన్మతిమెచ్చునా? ఇనుపకచ్చడాల్గట్టు కొన్న మునిముచ్చులైన నీ కనకాంగిని గాంచిన మారశరాహతి మ్రగ్గిపోరె. వారెవ్వరుఁ గనివినియెఱుంగరు. నారదుఁడైనను భూలో కమునకు వచ్చి యీ బాలామణిం జూచియుండఁడు. చూచెనేని దేవలోకమునకేఁగి చెప్పియుండెడివాఁడు త్రిభువనవిఖ్యాతివడసి నాకలోకనివాసులై యమృతపానముచే నానందమనుభవించుచున్న రంభ యూర్వశి మేనక తిలోత్తమ మొదలగు దివిజవేశ్యలు సైతము మిక్కుటమగు చక్కఁదనమున నీ కన్యామణికాలికొనగోటికేని సాన యగుదురా? ఆహా! కన్నులున్న ఫలమిప్పు డనుభవించుచున్నాఁడ. నా యదృష్టమే యదృష్టము. నా జన్మమే ధన్యము. ఈ సుందరాంగి కన్యయా? గృహిణియా? 138

ఈ కమలాక్షి కన్యయగునేని వరించెద నే వరించినన్
నాకఫలంబు దక్కు నిఁక నాతి యెఱుంగదె రాజమౌళినే
చేకొనఁ జెల్లు నంచు నతి శీఘ్రము మత్సచివాగ్రిగణ్యు నే
వాకొనఁజేసి తజ్జనకువాక్యతతిం గమనింతు నంచెదరన్. 139

అతివ నిలిపి చని పందిట
జతనమ్మున నలుపు పౌరసన్మానంబున్
మతిగతి వేడుగఁ బొందెం
గత యర్థము కాని నటకు కైవడి వడిగాన్. 140

మరులు తీవెను మెట్టిన నరు మతి గతి
నపపథమ్మున బట్టె ధరాధిపు మతి
కోటి లింగార్చకుండు వేద కోవిదుండు
దశముఖుండు దాటం గలిగెనె దైవవిధిని 141

విధివిలాస మతివిచిత్రము. అతండు బాహ్యదృష్టితోం దన్మహా సభాస్తారులంజూచుచుండెంగాని మనోదృష్టితో వాసవీకన్యకామణిం గాంచుచు మన్మథమాయాజలనిధితరంగముల మునింగి తేలుచుండె. మోహాంధకారమునం గన్నుగానని వానికి సత్యవస్తుదర్శనము గలుగునా? ఆత్మజ్ఞానము నశింపకుండునా? అత్తఱి- 142

గోపాలదయావర్ధిత
భూపాలవతంసు కరుణ పొందెడి బుద్ధిం
బ్రాపుంగోరుచుం దమ్ముం
గాపాడంగం గాన్కలిడిరి- కాంపులు కరబాల్. 143

అంత నొక కొంత స్తిమితమ్మ స్వాంతమునకుం
గలుగం గలయుంగం దత్సభం గాంచి యధిపుం
డమిత సంతోష మందఱు నందునట్లు
యటం గృతజ్ఞతం దెలుపు వాక్యములు వలికె. 144

తత్సభానంతరంబ—— 145

విడిచి గదిం జేరి తన మనోవృత్త మాత్మ
మంత్రి కెఱింగింప నాతం డమ్మనుజనాథు
నానమై యామె నాయన నటకుం బిల్చి
యాసనం బిచ్చి మర్యాద లందం జేసి. 146

ఇది యధ్యేషణ గాని యాజ్ఞ యని నీ వెంతేని భావింపకే
సదయా! కన్య నొసంగుమా నృపున కీసంభావ్యకల్యాణసం
పద సొంపారు నిలింపసౌఖ్యతతిమై మాకీవ పూజ్యుండవై
ముద మొందం గల పుణ్య మింకం గనుమా భూనేత జామాతగా. 147

అభినంద్యవంద్యవిద్యాహృద్యసద్యశో
మాన్యఁ గన్య నొసంగ మనుజపతియు
నిచ్చు గాంగేయరథభాశ్వరత్నహా
రాగ్రహారాదు లనుగ్రహమున
నస్మదాదులు నీకు ననుయాయులై సభాం
తరముల నినుఁ జెప్పఁ దలఁతు రెపుడు
దాన నీ సత్కీర్తి దశదిశావ్యాప్తమై
భోగమ్ములకు స్థానభూతమగును

అంత నీవును నీ వార లింత యంత
యనుచుఁ జెప్పఁగ రాని భాగ్యంబు లంది
రాజ్యపరిపాలనాదుల రాజు కీర
కుడి భుజంబుగ నుంటకుం గొదువ గలదె? 148

జనవిభుని కోర్కి యిది యన
విని భూమిస్పృశుఁడు భూమి వీక్షించి వెసన్
వినయ నయ భయ రసమ్ములు
దన మనమునఁ బెనఁగొనంగఁ దా నిట్లనియెన్. 149

ఓ మంత్రివర్య మీరలు
ధీమంతులు వెనుక ముందు తెలిసియు నన్ని
ట్లామంత్రించి వచించిన
యా మాటకు బదులు నేన యాడఁగ నగునే? 150

తల్లియు బందుగుల్ హితులు తాతలు జ్ఞాతులు లేరె? చెప్పఁగాఁ
జెల్లదె వారికిం దగిన చేఁతకుఁ బెద్దల సూక్తి భక్తి సం
ధిల్లఁగఁ గైకొనందగదె? ధీవర! యిద్ది విచిత్రపృచ్ఛగా
నుల్లమునందుఁ దోఁచినది యోచనచేయుట కాజ్ఞ నీయరే? 151

అష్టాదశపట్టణ వణిగ్వరేణ్యు లొక్కచోఁగూడి యోచింపనిది యిట్టియపూర్వకార్యాచరణంబు యోగ్యంబుగాదు. వారియనుమతిలేనిదె నేనిట్టికృత్యమునకు సాహసించిన మద్వంశవృద్ధులు నను బహిష్కరింతురు. కట్టుబాటుతోఁగూడిన పూర్వాచారములన్నియు భారతీయులలో నొక్కసారి నశింపవు. సచివాగ్రణీ! మీరలులౌకిక

ధర్మకర్మమర్మజ్ఞులరు. మీకుం జెప్పునంతటివాఁడఁగాను. నాకుంగల పెక్కు చిక్కులంగూడ నొక్కసారి సమీక్షించి సముచితముగఁ బౌర్వాపర్యఫలితాంశముల నాలోచించుకొనుటకుం గొంతకాల వ్యవధి నీయ వేఁడెద-

అని వారల సెలవుం గొని
మనసు మనసు లేని యట్లు మసలుచు సతికే
మని చెప్పుదు నని తలఁచుచుఁ
దన గృహమున కేగి గృహిణి దాపునఁ జేరన్. 153

ఏలిక వాలక మాతం
డాలస్య మొనర్పలేక యాలికిఁ దెలుపన్
శీలవతి యామె యెదనది
పాలఁబడిన దోసగింజ భంగిన్ జెఱచెన్. 154

ఆపదలఁ గూర్చి చర్చించి యాత్మఁగుంది
చెదరిన హృదబ్జపత్రముల్ చేరఁ దీసి
కొనుచు గంభీర యోచన మునిఁగి యవల
నవనతశిరస్కయై యిట్టు లనియె నామె. 155

ఇతని కుపహారముల నెన్నొ యిచ్చి పంపి
యింత చేసిన మన కిట్టి యెసరు పెట్టి
యింటఁ దిని యింటివాసంబు లెన్నువారి
నెట్లు భగవంతుఁడైన సహింపఁ జాలు. 156

ఇల జేని జీవితమ్మునఁ
గల రసములు వేఱు వైశ్యకన్యామణియుం
దలరు స్వభావము వే అల
తొలి గుణములు రెండు మైత్రితో నెటు లుండున్. 157

నిర్వాణమార్గగామికి
గర్వాంధున కాత్మకథలు కలియుట కలదే
సర్వేశ్వరుఁ డెటు సేయునొ
పూర్వాపరదిశల పొత్తు పొసఁగునె వసుధన్. 158

ఒక్కగానియొక్క చక్కని కూఁతురు
పుట్ట నిట్టి దృష్టి పెట్టె నృపుఁడు
బుధులు చెప్పి నంత బుద్ధి కొప్పిన యంత
చేయఁ దగదె మనము చేటు తొలఁగ. 159

అనునయవాక్యంబులు విని
యనునయమున నపుడ తాను ననునయవాక్యం
బును దెలిసి యాతఁ డామెకు
సునిశితసంకల్పధర్మసూక్ష్మము మెఱయన్. 160

ప్రేయసీ, నీవాడినది సత్యంబు— 161

దొడ్డదొరయంచు మనమెపు
డడ్డాడక కొల్చినార మమితేచ్ఛమెయిన్
గడ్డుసమస్యనుదెచ్చెను
విడ్డూరపు వార్త లెన్నొ వినఁగా వలసెన్. 162

ఉత్తమజనంబుతో వైర మొదవిన యెడ
నది యపార్థమునకు దారి యగుట వమ్మ
సరస యెటుత్రిప్పిచదివిన సరస యగును
మిసిమి యెటుచూచినను నది మిసిమి యగును. 163

మొహరీలు మెహర్బానిగ
నహరహ మడుపెంచుచుంత నపరి యుడరి యి
మ్మహికా తులు భువి దివియను
స్పృహలేకయె మెలఁగుచుండ్రి- చెనటులవోలెన్. 164

పొల్లుగాదిది పొలతిరో ముల్లువోయి
యరఁటియాకునఁ దగిలిన నరఁటియాకు
వోయి ముల్లాక రెంటను బొందు హాని
యరఁటియాకను సామెత నరయలేవె? 165

ఆ సురవృత్తము ల్దెలియు కా సురవృత్తి వహించి మించి పె
న్గాసర మట్ల మీసరము గాసిలఁజేయుచు లోక జాలముల్
మీసముఁద్రిప్పు భూపతుల మెప్పున కిచ్చకమాడి వారికై
దోసములాచరించు కడు దుర్మతి దుర్గతి వొంద కుండునే. 166

మనుజునకు నొక్కమాటయు మహిషమునకు
నొక్కదెబ్బను సామెత యున్నదెగద?
వీఁడు మోహాంధుఁడై చెలరేగినాఁడు
వాని యంతము చూచుట యవసరంబు. 167

వగఁ బొగులఁ దఁగునె మగువా
తగ వాడిన వినక నృపుఁడు దండించినచో
నగరే సజ్జన ముఖ్యులు
నగరేశ్వరు కన్ను గప్పునా యెవఁడైనన్. 168

కావున — 169

కుల సభ గావించి యిలా
తలనాథుని కోర్కెఁ దెల్పి తత్సభ తీర్పే
బలవత్తమ మని మంత్రికిఁ
గల తెఱఁ గెఱిగింప మనకుఁ గర్జము గాదే? 170

ఆవేశపడక వేగ స
మావేశము జరిపి స్వమతవిద్వద్గోష్ఠిన్
గావించి రెంటఁ దేలిన
భావవిశేషమును బట్టి వర్తింపఁ దగున్. 171

కావున నిప్పుడె యెల్లర
రావించెద ననుచు గుడికి రప్పించి సభన్
గావించి పెద్దలను సం
భావించుచు లేచి యిట్లు పలికెన్ బెలుచన్. 172

ఓ మహాశయులార యుర్వీతలేంద్రుఁడౌ
విష్ణువర్ధనుఁ డేలొ వింత బుద్ధి
వాసవికన్యకఁ బరిణయమాడఁ దా
పిలిపించి నాకుఁ జెప్పించినాఁడు
అది యసాధారణ మౌటచేఁ దోఁపక
కులబంధువుల పక్కఁ దెలిసికొనిన
పిదప నేమాటైన వెలిబుచ్చఁ గల నంచు
సెలవంది మిమ్మిటఁ జేర్చినాఁడ

నొక్కవెస రాజరాజు వేఱొక్కవైపు
హైందవాచారధర్మనిష్ఠార్థగరిమ
మనల లాగుచునుండు సమానబలిమిఁ
జెదరని మనస్సుతోడ యోచింపఁ దగదె? 173

వర్ణాంతరవైవాహిక
నిర్ణయదుర్ణయనయార్థినిర్ణీతలు మీ
రర్ణవగంభీరులు నా
కర్ణంబులు తనియ నర్థకార్యము చెపుఁడా! 174

గురుతరభక్తి నాత్మజులఁగోరి వ్రతమ్ముల నాచరించి యా
పరమశివప్రసాదమునఁ బావనమూర్తుల సత్యకీర్తులన్
వరగుణ వస్తులం బడసి వర్ధిలు వంశమటంచు నెంచఁగా
నరపతిదృష్టి నేఁటి కిటు నా సుతపైఁబడె నేమిసేయుదున్. 175

అనుచుం బదునెన్మిది జనపదమ్ముల నుండి యాహూతులై
చనుదెంచిన కులమతాచారశాసనకర్తలగు పెద్దసెట్టులతోఁ గూడి
యున్న తత్సమితికి మ్రొక్కి నిలిచిన 176

కలకలము పుట్టె సభలోఁ
గలిలకణ మ[illegible]చు నిపుడు క్ష్మాపాలునకుం
గల[illegible]గా [illegible]తు [illegible]ంచును,
గల[illegible] [illegible]గౌరవంబు గాదా యనుచున్. 177

అతనికిఁ గిన్కవుట్టు మనకందఱకుం గడుఁ గీడుగల్గు భూ
పతి కెదురాడి నిల్వఁగల బాహుబలాఢ్యుఁడు లేఁడుగాన నీ
సుతనిడి వంశహానియను క్షోభకుఁ జోటు నొసంగకుంట స
ద్గతియని దోఁచె నాకని సదస్యుఁడొకం డటలేచి పల్కఁగన్. 178

కలియుగ మిద్ది దీన జనకాంక్షలు కక్షలు ధర్మకర్మముల్
మెలఁగవు నొక్కబాట మితిమించిన కృత్యముపట్ల నేర్పుతోఁ
దొలఁగుట లగ్గు మార్పెపుడుఁదోఁచు జగద్గమనంబునందు ని
శ్చలమతిఁ గన్యనిత్తుమని శాంతతఁబల్కె నొకండు వెంటనే. 179

మనకంటె భాగ్యవంతుఁడు
మనకంటెం గీర్తిశాలి మానితయశుఁడ
మ్మనుజాధీశున కిచ్చుట
మనకేమి కళంకమనుచు మఱియొకఁ డనఁగన్. 180

పెక్కుమంది కాపల్కులు ముల్కులవలెనుంట సహింపరాని వయ్యె. కొంతసేపు పరిషత్తంతయు నిస్తరంగజలనిధివలె నిశ్శబ్దము గానుండె. సభాసదు లుద్విగ్నహృదయులై సమాలోచనాసముద్రమున మునిఁగితేలుచుండిరి. ఇదియింతేనంతేఁబోవు పనికాదని యందఱుం దెలియు 'రాజు దలంచుకొన్న దెబ్బలకుఁగొదువా' యన్న నానుడి నెఱుంగనివారులేరు. అట్టియెడ నొక్కధీశాలి లేచి యిది కడుజాగరూకతో నిర్ణయింపవలసిన విషయము. ఇందు మనము తొందరపడరాదు. 181

ఎన్నఁడురాని భూపుఁడిట కేటికివచ్చెను వచ్చినట్టి వాఁ
డున్నతవంశజుండనుచు నొప్పగ సత్కృతిసేసి చక్కఁగా
నిన్నగరంబుఁ జూడుఁడని యేటికితెచ్చితి మింతమందిలోఁ
గన్నియనెట్లు గాంచె జనకంటకుఁడౌనటు కన్నుగుట్టగన్. 182

ధర్మపరిపాలనంబునఁ దా జనంబు
నడుపవలసిన వాఁడిట్లు నడచెనేని
సంఘమర్యాద లేక్రియ సడలకుండుఁ
గంచెయే చేనుమేసిన గతి యిఁకేమి? 183

ధర్మనిర్ణయ బుద్ధికిం దగిన శక్తి
దనకునిచ్చి సృజించెను దైవమనుచు
నమ్మి వర్తింపఁజాలని నరపతి యెటు
లైహికాముష్మికసుఖంబు లందఁగలఁడు. 184

సన్నపుఁ బని గాదిది మన
కున్న తెలివితేటలెల్ల నుపయోగపడం
దిన్నఁగ దూతల నంపి ప్ర
సన్నునిగాఁ జేయఁదగు రసాతలనాథున్. 185

విని కని యెఱుఁగ రొకప్డున్
మన పూర్వులు తాఱుమాఱు మాటలు క్రియలున్
మన కేమి గలఁగ నున్నదొ
మనుజపతికి బుద్ధి మాఱు మార్గముఁ గనుఁడా! 186

ఘనగదా కార్ముక ఖడ్గకవచామోఘ
బాణతూణీర సంభరితు లగుచు
దుష్టశిక్షణ సదా శిష్టరక్షణ సల్పి
ధర్మముఁబ్రోచు భూధవుల శీల
మేడ వాణిజ్యాదు లెలమిమై వృత్తిగా
జీవించు వైశ్యుల శీలమేడ
రెంటికిం దులయేడ పృథ్వీశుఁ డెఱుఁగఁడా
యెఱుఁగఁడే సజ్జను లెఱుకపఱచి

కనులు తెఱపించు టుత్తమకార్య మగుట
స్థిరముగా మనకున్న సందేహ మెల్ల
నున్నదున్నట్లు రాజున కుగ్గడించి
మనము మనగౌరవము నిల్పుకొనుట లెస్స. 187

అని యాడి పెద్దలకు నమస్కరించి కూర్చుండ— 188

అంతన్ వృద్ధుఁ డొకండు లేచి యిది యే మన్యాయమో యెన్నఁడీ
వింతన్ వింటిమె వర్ణధర్మములఁ దా వీక్షింపఁగాఁ జెల్లదే?
యెంతో వంత జనించుచున్నది నృపుం డేరీతి వారించినన్
బంతం బొప్పఁగ ధర్మశాస్త్రపథమున్ భాషించి గెల్వందగున్. 189

కాదనకుండ మీ రిదియు కర్జముగా నెదురొడ్డి నిల్వ నిం
కేదెటు వోయినన్ యశ మదె నలుదిక్కుల దక్క నెద్ద నీ
సోదము బాధగాఁ దలఁపఁ బోకుఁడు పోకుఁడు కొ్రొత్త తో్రోవ నో
సోదరులార! మోద మెది సూక్ష్మతరంబుగ దెల్పుఁడీ యనన్. 190

ఎడయు తొడరిన తఱిఁ బెద్ద లెట్టు సెప్పి
రట్టు సేయుట నల్వుర కనుచితంబె
వంగడమునకు నపకీర్తి వచ్చు పనులు
వలదు వలదంచు పలువురు పలికి రపుడు. 191

అటఁ దన ఱేని యాన సచివాగ్రిణి వారువ మెక్కి తత్క్షణం
బిట కరుదేర వైశ్యవరు లిచ్చిరి కాంచనపీఠ మాతఁడం
తట నృపుకోర్కిఁ దెల్ప నది ధర్మము కాదని వర్ణసంకరం
బెటు సహియింప నేర్తు మని వృద్ధులు పల్కి రనల్ప విజ్ఞులై. 192

అతం డాపలు కాలకించి దరహాసాంకూరవక్త్రంబుతో
నీతుల్ మీరలు నేర్వలే దనను గానీ ధర్మశాస్త్రంబులున్
ఖ్యాతిశ్రీయుతభారతాదులును జక్కం జూడమే యెంచఁగాఁ
జాతుర్వర్ణ్యవివాహయోగ్యులు గదా క్ష్మాపాలకగ్రామణుల్. 193

మున్ను ధృతరాష్ట్రుఁ డెంతయో ముదముతోడ
వైశ్యకన్యను బెండ్లాడె వైభవమున
నద్ది ధర్మము కాదని యాడి నారె
పెద్దలానాఁడు నేఁడిట్టి సుద్దులేల. 194

మఱియుం బెక్కు దృష్టాంతంబు లొసంగెద నాలింపుడు, సుక్షత్రియవంశసంజాతుం డగు యయాతి శుక్రదుహిత యగు దేవయానిం బెండ్లియాడె. అంతియె కాదనంతాసురులు సహితము మహీకాంతుల కన్యలం, బరిణయంబాడుట వింతగాదు. ఋచీకుండను ఋషి గాధి యను రాజు కూఁతు సత్యవతి నుద్వాహమాడె. ఋష్యశృంగుండు రోమపాద భూపాలాత్మజ శాంతం బాణిగ్రహ ణంబు సేసికొనియె జమదగ్ని ప్రసేనజిత్ప్రభువతంసు పట్టి రేణుకం

జేపట్టె. భృగుపుత్రుండు చ్యవనుండు శర్యాతినృపతనూజ సుకన్య గృహిణిగాఁ జేసికొనియెఁ గాంచీపురంబునఁ గాంతారవంతుం డను భూకాంతుండు దపోధనుండగు కేశవాచార్యుల కూఁతు వివాహ మాడెఁ గావున మీ రిఁకఁ గాదనక కన్య నిచ్చి సుఖంబుండుఁ డన— 195

కచుని యుగ్ర శాపకారణంబునఁ గదా
దేవయాని క్షేని దేవి యయ్యెఁ
గన్య కట్టి కతము గలిగెనా చెప్పుఁ డంచు
నడిగె నాగశిష్టుఁ డతి రయమున. 196

వియ్యమునకుఁ గయ్యమునకు
నెయ్యమునకు సమత వలయు నిశ్చయ మిది యో
యయ్యా మేనఱికము నిడు
టయ్యల యాచార మనియె నమృతాహ్వయుఁడున్. 197

రాచకన్నెలుండ రారాజు మా బిడ్డఁ
గోరనేల? యింత గొడవ యేల?
మమ్ము పరిభవింప నుమ్మిద్ది తగదని
మంత్రితోడఁ బలికె మౌళిసెట్టి. 198

అదివిని యా పెద్దగొడ తలమానికమ్ము నలువలంకులఁ గనుం గొని సభికుల ముఖంబులఁ దనపనికి సుముఖత్వంబంతగాఁ గానక కరుణతోఁ బొంగి నిజనయనంబుల నిప్పులురాల— 199

మిమ్ముఁ బరాభవించుట నిమేషముపట్టదు బెట్టుగుట్టు లో
కుమ్మ ప్రతి కుమ్మరించు దుమ్ముగుచు ఘోరపరాజయకీలఁగాలఁగా
బొమ్మగవచ్చి కన్యఁ బతితేఁకొనిపోయిన దిక్కు గల్గునే?
కిమ్మన కింతు లెండనుచుఁ గేవలరాజసదృష్టిఁ బల్కెఁగన్. 200

ధరజఁగోరెడి జలంధరుఁలీల భీమరా
ఖ్యుందన కెగయు పుళిందువోలె
మోహినీ మోహబ్ధి మునుఁగు భస్మకుభంగి
సైరంధ్రిఁజెనకు కీచకునిభాతి
సీతామహాసాధ్విఁ జెఱఁబెట్టు పౌలస్త్యు
వలె దీననేమి కావలయునొ యది
తప్పింప నేరికిం దరమౌనె విధివ్రాఁత
యెవరి కెట్లున్నదో యెఱుఁగనౌనె?

అక్కటా! చెట్టు చెడువేళ కుక్కమూతి
పిందె లుదయించు నను మాట వృథయగునొకొ
యని కుసుమసెట్టి పల్కుట విని ప్రధాని
కనుఁగొలంకుల నునుఁగెంపు గదురఁ జూచి. 201

ఎవరితోఁ బల్కుచుంటివో యెఱిఁగి సరిగ
మాటరానిమ్ము పుడమిపై మనఁ దలంచి
మెట్టు దిగివచ్చె రాజు నీ పట్టికొఱకు
కొఱకరానట్టి కొయ్య గాకుము కుసుంభ. 202

ఉష్ణాంశుప్రతిమానతేజుఁడు మహాపుణ్యాగ్రగణ్యుండు సమి
న్నిష్ణాతుండు సుధాంశువంశజుఁడు నిర్విద్యార్థదానైకప
ద్రిష్ణుండాశ్రితలోకరక్షణకళాధీరాతిధీరుండు శ్రీ
కృష్ణుం బోలెడి విష్ణువర్ధనుని నీవీరీతి నోనాడుదే? 203

కన్య యెట్టు లన్యకాంతయౌ నామాత్రి
వైన మెఱుఁగకుండ వత్తు నొక్క
సాకుఁ జెప్పి రాజు సాగనంపఁ దలంచి
యాడుచుంటి రనుచు నాత్మఁ దలఁతు. 204

మీకంటె ముమ్మడుంగులు
మాకుఁ దెలియు వెనుకముందు మఱపున బొమ్మక
బాకునఁ గ్రుమ్మిన రీతిగ
వాకొన మీకెంత క్రొవ్వు బలిసిన దౌరా! 205

రాజకార్యధురంధరుండనై ముందు వెన్క లరసి మీ క్షేమముతోc బాటు ఋష్మాపాలు కల్యాణమే పరమలక్ష్యముగా నింక నే నిత్తటిc గడసారి మాటలుగాc బల్కు పల్కులు సావధానులరై వినుండు. 206

ప్రతినc బూర్వపుc బుష్పవద్వంశ్యుల వలె
సకలదిగ్జైత్రయాత్రాప్రశస్తుc డైన
కువలయానందకరు రాజుc గోరి మీర
లల్లునిగc బొందు టెంతొ భాగ్యంబు గాదె. 207

సహజసౌందర్యవతులైన వన్యకులోద్భవుల భూకాంతుcడు వివాహమాడిన భోగిను లగుదురే కాని కులకాంతలు కాcజాలరు గదా. అట్టి వారి సంతతికి రాజ్యార్హత లేదుగదా యని భావింతురేమొ. మీపట్టికిc బుట్టిన పుత్రునకే పట్టాభిషేకము జరుగునట్లు వాగ్దాన మిప్పించెద. వలయు నేని యట్లు శాసనము వ్రాయించెద. అంతియ కాని నామెట్టయెదుట రాజును నామాన్యమానవునివలె నిందించిన నేను సహింపను. 208

ఏ మాపతి పోషణచే
క్షేమంబుగ నుంట నతని సేమమె గననౌ
స్వామి ద్రోహికి బంగరు
భూములలో నైన నింత పుట్టునె చెప్పుcడా. 209

కావున, మాసర్వస్వము ప్రభుని మేలుకొఱకు ధారవోసెదము. అది మీరును గమనించి దీర్ఘదృష్టితో నిప్పటికైనను మనస్సు మార్చుకొని కన్య నీయ సంకల్పింతురా సరి. కానిచో నతిశీఘ్రము కానున్నది కాక మానదు. విష్ణువర్ధన మహారాజు చండశాసనుcడు ముజ్జగంబుల నుజ్జ్వలాతలూపcగల సైన్యములు గలవాcడు. ఆతని కనుసన్నతో దివి భువి సంధింపc గల సమర్థులు పెక్కురు గలరు. కనుగలిగి బ్రతుకుcడు - 210

విడిది విడిచి యొకయుఁడు రాఁ
బడుచు గుఱించి చెప్పి యురక పంపుఁడు లేదా
గొడవ యగు నంచు నీయుఁడు
బెడఁద నడుమ నేల నాకు వెతలెద ననఁగన్ 211

భయపడి యమ్మంత్రిసత్తముని యెట్టయెదుట కూర్చున్నవారలం గొంద అతి శీఘ్రమయుత్థితులై సవినయముగ నమస్కరించి పోవలదని వారించిరి. అంత 212

బాలనగరులు నా నొప్పు వైశ్యయువల
ధన్వి యనువాఁడు లేచి ప్రధానిఁ జూచి
యార్య! లౌకికజీవయాత్రాంతరార్థ
వేత్తలరు మీరు మీకింత విసుగు తగునె? 213

కులధర్మము విడఁజాలక
పలువురలో నిట్లు బదులు పలికెఁ గుసుంభుం
డలిగిన నలుగునె మీరలు
బలవంతులు మమ్ముఁ దెగడఁ బాడియె యనఘా 214

కుసుమసెట్టి యన సామాన్యుఁడు గాఁడు. ప్రశాంతచిత్తుఁడు. అమిత రాజభక్తి తత్పరుఁడు. నిరంతర గౌరీశంకరారాధనశీలి. సర్వధర్మములు జ్ఞానవృద్ధులవలన సమగ్రముగ నెఱిఁగి యాచరించువాఁడు. కరుణారసభరితచిత్తుఁడు. మర్యాద నతిక్రమింపని వాఁడు. పరోపకారపరాయణుఁడు. సజ్జన విధేయుఁడు. అట్టి వానికి వరపుత్రి కగాఁ బుట్టిన దీ వాసవి. మీరు ధీమదగ్రగణ్యులరు. అన్యథా భావింపక నావాక్కులలోని యథార్థము గ్రహింప వేఁడెద. 215

చెట్టునఁ బండు గాదు తన చేతికి వచ్చిన యట్టు కోసి మీ
బుట్టనపెట్టి పోవుటకుఁ బుత్రిక నొక్కని కిచ్చువేళఁ దా
మెట్టుల నెన్నటిం గడచి మేకొన నౌనొ తలంప కిట్టు మీ
ర్వట్టిన పట్టు ఘల్లుకపుఁ బట్టు వలెం బిగియింప లగ్గొకో. 216

ఈ రట్టుండుఁడు నేనే
వీరల హృన్నీరజములు వికసింపఁగ వా
క్సారకిరణాళిఁ బఱపెద
నీరంధ్రవిచారు లగుచు నీ మాట వినన్. 217

అని సభఁ గని ఘనులారా!
పనివినుఁ డిఁక దేశకాలపాత్రల గమనిం
చి నడప మేలగుఁ గలి మహి
మన యాచారాదు లెల్ల మారుట వింతే? 218

పృథురణజయజనరక్షణఁ
బ్రథితబలంబరసి బుధులు రహి "నావిష్ణుః
పృథివీపతి" యన వినరే
పృథగ్విధము ధర్మపథము పృథ్వీశులకున్. 219

[illegible]రున్నదనుచు నూరక
తిరెఱుఁగక మాటలాడఁ దీఱునె సరిగా
సిరి రా మోకాలొడ్డుట
సరి యగునె భావి గతి విచారము వలదే? 220

వాసియు వీనము హెచ్చఁగ
భాసిలునని సచివవరుఁడు పలుకుచునుండం
గూనము చే మలపిన య
ట్లీనమయము నందు మెలఁగుటే తెన్ను యగున్. 221

జనవంద్యుం డరి లోక భీకర మహాశౌర్యుం డనూనప్రభా
వినుతుం డద్భుతమంత్రతంత్రయుతుఁ డావిర్భూతకీర్తిచ్ఛటా
ఘనదుష్యంతసమానుఁ డాత్మజనరక్షాశీలి విద్యుద్ఘనా
ఘనతుల్యాశ్రితపోషణాఢ్యుఁ డతనిం గాంక్షింపఁ గాఁజెల్లదే. 222

గారవమున ననుదినమును
సారస్వతసేవ సేయుసత్ప్రభు వతఁడే
కారణమున జనియించెనొ
వారక యూహించ వాని వలదనఁ దగునే. 223

కలియని బలియని పులియని
తెలియక నేనాడుకొనినఁ దీఱునె మనకుం
దొలి జన్మంబునఁ జేసిన
ఫలమేదో హేతువగుట భావ్యము గాదే. 224

పదిమంది పెద్ద లనువుగ
నిది ధర్మంబనుచు నెద్ది యేర్పఱచిరి య
య్యది నూత్నంబైనను బ్రిజ
వదలక మదినిల్పు శుక్రవాక్యము పోలెన్.

కావునఁ గన్య నిచ్చుటయె కార్యముగాఁ దలయొగ్గి దిగ్గనన్
భావి వివాహలగ్న మిఁక భవ్యులు జోస్యులు నిర్ణయింపఁగా
దేవరవారికిం దెలుప ధీవరు మంత్రివరేణ్యుఁ బంపి సం
భావితరీతిఁ దత్క్రతులు వారక సల్పుట చాల లగ్గనన్. 226

అంతరార్థ మెఱిఁగి యందఱు తల లూపి
జోస్యు నడుగఁ బాఱఁ జూచి యతఁడు
మాఖశుద్ధవిదియ మంచి లగ్నం బన
నపుడె పెండ్లి యనుచు నాడి ధన్వి. 227

దిగ్గన దగ్గఱనున్న ప్రెగ్గడకు నమస్కరించి— 228

మేరువు తలక్రిందైనను
నీరధు లింకినను సూర్య నీరజవైరుల్
మేరలు మీఱిన నా నుడి
మాఱదు ధీరాగ్రగణ్య మాట లిఁ కేలా. 229

కుసుంభుఁడును నీసంబంధబు తనశక్తికి మించినదని భావించు చుండెగాని వేఱొకండుగాదు. ఎల్లరాశ్చర్యపడున ట్లుల్లన కపూర్వానందకరవస్తువితతు లేమి యర్పింపఁ గలమా యని, యత్తవారింటి కంపునపు డాత్మజాతకుం గంటె కాగినంత యరణ మేమీయఁగలమా యని సముదంచిత లాంఛనములు మనకందుపాటులోఁ గలవా యని బంధువర్గమునకు డెందములు గందళింప విందులుసేయఁగలమా యని బహువిధముల నాలోచించుచున్న వాఁడు. అద్దానిని యుష్మాదృశులు మన్నింపందగు నని తత్సచివాగ్రణితోఁ బలికి కుసుమసెటి నవలోకించి

వైభవ ప్రాభవంబుల వైపు దృష్టి
నిలిపి కన్య నీ నీకొంట నేర్పు పెంపు
కానఁ, గానని వాఁడు గాఁ గడఁగ కాత్మ
జాత భూపతి కిచ్చి విఖ్యాతిఁ గనుము. 231

అనినంత మహామంత్రి యందుకొని యల్లుని మర్యాదలం గూర్చి మీ రంతగాఁ జింతింప నక్కఱలేదు. మీ కన్యాదానమే మహాసన్మానము. ఐనను మీ శక్తి కొలందియు రాజును సన్మానింప వచ్చు. అది యాతఁ డమితసంతోషమున నద్వితీయముగ భావించు. కొండంత దేవునకుఁ గొండత పత్రి పెట్ట లేరనుట జగద్విదితము. దానింగూర్చి మీ రణుమాత్రమైన ననుమానపడరాదు. మీరును విత్తవదగ్రగణ్యులు. సాధ్వగ్రియాయులు. సాదృశ్యవైదృశ్యముల తో నివ్వఁడు పనిలేదు. సకలజీవకోటిలో మానవజన్మ ము త్తమము. అందును బురుషజన్మ ముత్తమోత్తమము. ఇఁక మహారాజుగాఁ బుట్టుట యెంత సుకృతఫలమో మీ కుందెలియనిది గాదు. అట్టి మ— మీకల్లుఁడగుట మీ యదృష్టము. ఇంక మీ రనవసర సందేహంబులఁ బొద్దుపుచ్చక యనంతర కల్యాణ కార్యక్రమమున నుపక్రమింపు డన ధన్వి మహాప్రసాదం బనియె. 232

అంతట మంత్రి సంతసము నందుచు భూవిభుఁ జేరి వృత్త మా
ద్యంతముఁ దెల్పె వల్లె యని యానృపుఁ డేఁగెను రాజధాని క
త్యంత విచారభారమున నప్పటి యాపద తీఱ నంచెదన్
కాంతము చిక్కఁబట్టుచు నిశాంతముఁ జొచ్చెఁ గుసుంభుఁ డత్తరిన్.

భవిష్యద్విప్లవాత్మక కార్యక్రమముఁ గూర్చి తలకొక మాటాడుకొనుచు సభాస్తారులు నిజనికేతనంబుల కరిగిరి. పిదపఁ గతిపయదివసంబులు సన నొక్కనాఁటు సతీసుతవృద్ధహిత బాలనగరావతంసపరివృతుండై భాస్కరాచార్యుల నాహ్వానించి కలతెఱంగెఱింగించి యేతదపూర్వసమస్యా పరిష్కారంబునఁ గింకర్తవ్యతావిమూఢుండ నైతి నీకష్టవార్థి నుండి సముద్ధరింప మీ సదుపదేశ మొక యొక్కండ సమర్థంబని డోలాందోళితమనస్కుండై శ్రేష్ఠి తలవంపఁ దన్నృహిణి కన్నీరునింపఁ దద్గురుం డవ్వారలం గని— 234

సకలకలావినోది నృపసత్తముఁ డింత యహంతఁ బేర్చి తా
నొకఁడ మగండటంచు సమయోచిత యోచనశూన్యుఁడై ప్రజా
ప్రకరము బాధపెట్టు టిది భావ్యమె? త్రుళ్ళిన యెద్దు గంత మో
యక యెపుడైనఁ దప్పునొకొ యన్నిఁటి కీశుఁడు కర్త గాఁడొకో. 2:5

మని మననిచ్చెడి నృపుఁ డొగి
వినయవివేకశౌర్యవిశ్రుతధర్మం
బనయము దృష్టికి రా స
జ్జననుత సత్కృతులు సల్ప జాలు సతమ్మున్. 236

ధరణిధవుఁ డనఁ బ్రజలకుఁ దండ్రి వంటి
వాఁ డనుచు గౌరవింపఁగా వచ్చెఁ జిక్కు
మిక్కుటపు భక్తిఁ జక్కఁగ మ్రొక్కఁ బోవ
గుడి విఱిగి మీఁదఁ బడినట్లు గోచరించె. 237

ధవుఁడైన బంటె యైనను
బ్రవిమలసుజ్ఞాని మైత్రి బంధుర మగుఁ గా
యవివేకి చెలిమి యాపద
కవకాశముఁ గూర్చు ననుట కాధార మిదే! 238

జగమెల్లన్ సృజియింపఁ బెంపఁ దన యిచ్చన్ సంహరింపం దగం
బ్రగతిం జూప నధోగతిన్నిలుప యెవ్వం డోపు సద్భక్తిమై
దిగధీశు ల్గొలువంగ నెవ్వఁ డచలాధీశస్థుఁడై యుండు న
య్యగజానాథు దయావిశేష మొగిఁ గష్టాంభోధి దాటింపదే. 239

అచ్చపురాజభోగముల కగ్గలమై యెవఁ దృప్తిఁ గాంచ కిం
కెచ్చుగఁ నగ్గి యాజ్యమును హెచ్చుగఁ బోయుకొలది యింకనుం
బెచ్చుగఁ బోయుఁ దన్విధము భీకరకాంక్షల కగ్గమౌ నృపుల్
సచ్చరితంబు నేర్చుకొనఁ జాలుదురే యొకనాఁటి కేనియున్. 240

అని నంతఁ దనవలన వీరి కెంత వంత వాటిల్లిన దని కొంత తడవు చింతించి పూర్వజ్ఞాన సంస్కారాలగు కన్యక తన జననిం గని యిట్లనియె— 241

అంబా వ్యాకుల మందకు
మంబాకులు లేక యతఁడ యడఁగు సరగ శో
కం బాపుము నా శాపము
దంభోళి తెఱంగు నతని తలను నగల్చున్. 242

ఇంతటి దిట్టలుండ భయమేటికి మేటికి నీకు నాకుఁ గాఁ
జింతిల నేల నేలపయి జీవుల జీవితముల్ స్థిరమ్ములా?
యెంతటి రాజరాజయిన నేమది నొల్లమి నేమి సేయునో
సుంత దలంపుఁ డీశ్వరుఁ దిశ్రుద్ధిగ నమ్మినఁ జేటు గల్గునే? 243

అగచాట్లకె పుట్టితి నీ
వగ నాపయిఁ బ్రేమ యెంతొ వారక తెలుపున్
సెగ లేనిదె పొగ రాదను
జగ మెఱిఁగిన సూత్రి మీవు చాటితి తల్లీ! 244

మేలనుకొన్న దొక్క యెడ మిత్తిగ దోఁచు నొకప్డు మిత్తియే
మేలుగ మాఱుఁ గాలము గమించును మర్మము విప్పి చెప్ప కిం
కేల కృశించె దీవు జననీ! తరుణేందుకలాకలాపి నా
పాలఁ గృపాలవాలుఁడయి భాసిల నింత కొఱంత గల్గునే! 245

అగ్నిమిత్రన్యాయంబగుఁ జూచుచుండు డన నాచార్యుం డందుకొని తల్లీ చిఱుతవయస్కవయ్యు సదసద్వివేకశీల వీ విషయం బున నీ యుల్లం బేమన జననీజనకులసాక్షిగాఁ బరమేశ్వరుఁ దప్ప నన్యుఁ బరిణయమాడ నని విష్ణువర్ధను నుద్దేశించి విషభృత్పథగామి, పద్మినీసుమనఃకంటకుఁడు కళంకి, గురుద్రోహి, చక్రిశాంతభేది యగు నీరాజు నిశాచరుఁడు గాక భువనైకజీవనదాత యగు ఘనతుల్యుఁడా కాఁ డిఁకఁ బెక్కేల 246

ఎత్తు లెన్ని యెత్తి యేరీతి వచ్చిన
నాత్మశక్తిముందు నణఁగి పోవు
పొల్లు హల్లు మీఁదఁ బొసఁగునా బిందువు
పుణ్యలోకగణ్య బుధవరేణ్య. 247

# శ్రీ కన్యకాపరమేశ్వరీ చరిత్ర

వలయురీతి మనము వర్తింపఁ దగు నన
నలరి దివ్యదృష్టి నఖిల మెఱిఁగి
ధన్వి నతఁడు పిల్చి తనమాటగా వెళ్ళి
ప్రభునితోడ నిట్లు పలుకు మనియె.

ఆంధ్రదేశోద్ధారకుండును, జాళుక్యవంశవర్ధనుండును, విష్ణువర్ధనమహీవల్లభు నాశీర్వదించి యర్యకుల గురువర్యు భాస్కరాచార్యులు చేయు హితోపదేశము—

పుణ్యశ్లోకుఁడు చారచక్షుఁడు కళాపూర్ణుండు జన్యక్రియా
గణ్యుం డార్తజనావనుండు కవిరాట్కల్పమ్ము నా నొప్పి పా
వీణ్యం బేర్పడ నేల నేలుచిటు పృథ్వీనాథ! మోహక్రియా
రణ్యం బీవు చొఱ న్మరుండు నిను దిర్యగ్జాతిగాఁ జూడఁడే?

ఎందఱు రాజు లేలరు మఱెందరు చక్కని కన్నెఁ జూడ రీ
చందముగా వరించి నిజసాహస మెల్లను జూప నెంచిరే
యెందుల కింత పట్టుదల యేదెటు లైనను బిడ్డ నిత్తురే
యందని మ్రాని పండ్లకొఱ కఱ్ఱులు సాచిన నందనేర్చునే!

ఎది మే లెది కీ డొసఁగునొ
యెద గాటపుఁ జింతసేయు టింపగు "సహసా
విదధీతనక్రియా" మ్మని
సదయులు సత్కవులు మున్ను చాటరె హితముల్.

చంద్రవంశ్యులు భరతాది చక్రవర్తు
లమితధర్మాత్ములని పురాణములు వొగడు
వరుస దప్పనె నివును వారివంటి
వాఁడవని నమ్మినారము ప్రభువతంస!

పుత్రకామేష్టి సలుపంగఁ బుట్టినట్టి
ధన్యయగుఁ గాని కన్య సామాన్యగాదు
దీర్ఘదృష్టిం గనుంగొన దేవుని దయ
యామెయందుండె నని మదీయాత్మఁ దలఁతు.

కన్యాదృఢసంకల్పము
నన్యులు పరికింప కష్టు డాడిరొ యేమో
మాన్యా విశిష్టదృష్టిం
ధన్యయయిన యామె హృదయతత్త్వము గనుమా! 255

అసమాంబకుఁ గసిమెసఁగిన
యసమాంబకుఁ జింత తప్ప నన్యవిధముగాఁ
ద్రసరేణు వంత సందును
బొసఁగదు నీవేల భ్రాంతిఁ బొందెద వధిపా. 256

ఇంధానచిత్రకుని హృది
స ధించి జపించి యతని సామే న్వదయుఙ
బంధించె నైహికేచ్ఛల
యందని పండునకిఁ కేల యాసంగంబుల్. 257

నరరూపమ్మున హరుఁడే
యరుదెంచి లలాటవహ్ని నమరాపగయుఙ
నరగునఁ జూప నతని నీ
వరపుత్రిక పెండ్లియాడఁ బ్రీతినయుఁ గొనియెఙ. 258

కావునఁ గన్యయు నన్యయ
యీవిధమునఁ గోర వృజిన మెంతయుఁ గలుగుఙ
భావము పరిణతి సెందిన
భావి శుభంబగును లోకపాలురు మెచ్చఙ. 259

అన్యు మనస్సునందు వరించియుండెనని తెలిసికొని కాశీరాజు పెద్దకూఁతు నంబ యను దాని గాంగేయుండు మధ్యేమార్గమున విడిచిపెట్టె నను భారతకథ నీకుం దెలియనిదిగాదు. మహాధర్మవేత్తయగు భీష్ముని వంశమునఁ బుట్టిన నీవు నీవంగడంబునకుఁ గళంకము గలిగింపరాదు. ఈవిషయమునఁ బరుల బలాత్కరించుట మహాపాపహేతువు నీవలనఁ బెక్కుమంది దుఃఖపడుచున్న వారు. 260

కాదని తెగించితివా కన్యకాకంధరా కందరాంతర్గతజపిత పంచాననశక్తిశోభితపంచాక్షరీమంత్రప్రభావ పరిపుష్టశాప పంచాస్య నిర్గమంబునఁ బంచత్వంబు నొందఁ గల విదిసత్యం బని నాయంత ర్వాణి దృఢముగాఁ జెప్పుచున్న దింత చాలని ద్రుతగతిం బోవ నతని కాజ్ఞ నిచ్చిన నతండును హుటాహుటి రాజమహేంద్రివరమునకుఁ జని యట - 267

దిగధీశుల్ దనుఁ గొల్వఁ గొల్వునకుఁ దద్దేవేంద్రుఁ డేతెంచు భం
గిగ సామంతులు మంత్రు లాప్తులు కవుల్ గీర్వాణవిద్వాంసులుం
దగురీతిన్ సభ నుండ వచ్చె నృపుఁ డంతన్ వీరులంబిల్చి తా
నొగి నిచ్చెన్ బహుమానముల్ విజయశబ్దోత్సాహముల్ హెచ్చఁగన్.

ఘనవిజయమునకు మీ దీ
వనలే కారణము లనుచుఁ బరమప్రీతిం
గొనియాడెను దనకొల్వున
వినయమ్మున సంస్కృతాంధ్రవిద్వత్కవులన్. 269

అత్తఱి ధన్యవచ్చి ధవు నాజ్ఞ మహాసభఁ జొచ్చి కన్యకా
చిత్తము తద్గురూత్తముల శీలము భాస్కరు దివ్యబోధ యా
పత్తనవాసవైశ్యజన పద్ధతి సర్వమెఱుంగఁ జేయ వె
ఱ్ఱెత్తిన చూపు చూచి పృథివీశుఁడు రోషకషాయనేత్రుఁడై. 270

ఔరా! యేమని పేలినారలు ధనాహంకారనిశ్శంకులై
రారాజుం గడు ధిక్కరింపఁగల వీరశ్రేష్ఠులాశ్రేష్ఠు లౌ
రౌరా! నాఁడు మదీయమంత్రివరుతో నట్లాడి యిట్లాడఁగా
నోరా యయ్యది తాటిపట్టె? యిఁక నెందున్ మీకుఁ దావుండునే? 271

కన్నియ నిత్తు మిద్ది శుభకార్యము గావున మాఘశుద్ధమం
దున్నది మంచిలగ్నమని యూర్జితవాక్కులఁ జెప్పి పంపి నాఁ
డన్నది వ్యర్థమౌ నటుల నాడుటకా యిటువచ్చినాఁడ వే
మున్నది మాట మార్చుకొను నున్నతబుద్ధివటం చెఱుంగనే. 272

అంకిలిలేదు మీకనుచు నాడెడి వేళ గురుం డసాధ్యుఁ డే
వంకను దాగియుండెఁ దనవాక్కు లమోఘములంచెఱింగినన్
బింకముతోడ నాఁడె యిటు బెట్టుగ నేటికి పల్కకుండెనో
కొంకకఁ గొల్వునందు నొఱగొడ్డెము లాడఁగ నీకుఁ జెల్లునే? 273

ఆదియునుగాక నీవు పరులందఱి మాట యటుండ నిప్పనిం
బదిలముగాగఁ గూర్తునని పల్కితివంట యమాత్యవర్యతో
యెది యెది మోముఁ ద్రిప్పు మరెరే యితఁ డప్పటి ధన్వి కాఁడొకో
హృదయము లేనివాని బ్రతు కెంతయు నీచము గాక యుచ్చమే. 274

ఆచార్యుఁ డెవ్వఁ డతనికి
నీచోటం జోటు గలదె యీ బెదరింపుల్
మాచెవిఁ జొఱఁ గలవనుకొని
వాచాలత సాగనీక బంధింపు మిఁకన్. 275

అనుచుం గ్రేవల దృష్టిఁ ద్రిప్పఁగఁ దదీయాత్మాభిమానోన్నతిన్
మనసారం గమనించి నిల్వఁబడి యుష్మత్పాదముల్ సాక్షిగా
జనపాలా భవదీయకార్య మెటులే సాధింప యత్నించినాఁ
డను గానీ, వృథయయ్యె నంచుఁ దగ నాడెన్ ధన్వి భీతాత్ముఁడై. 276

నక్క వినయంబులను జూపి నాఁడు పెక్కు
శపథము ల్వల్కి నన్వీఁడు సాగనంపె
యిప్పు డిట్లనఁ గారణ మేమి యనుచుఁ
దోఁకఁ ద్రొక్కిన త్రాచునాఁ దోఁచె మంత్రి. 277

అట్టి సందిగ్ధసమయమున నోరెత్తిన నేమి కీడుమూడునో
యని యందఱుం గడు జాకరూకతతోఁ జూచుచుండ సచివాగ్రణి 278
లేచి—

స్థలమును బట్టి మాఱు మిడుతం బలె మార్చును వేషభాషలం
దులువ మహాత్ము లెన్నఁడటు తోపరు చూపరు మాఱుత్రోవ కా
వలసిన కార్యయత్న మతిబాధ్యతమై నొనరింప కున్నచోఁ
జులకనయౌఁ బ్రభుత్వము త్రిశుద్ధిగ నమ్ముము రాజరత్నమా! 279

విన్నఁబోయిన మోముతో విధికృత మిది
దాట నెవ్వారికైనను దరమగునొకో
కౌరవులు కృష్ణునంతటి ఘనునినైనఁ
బట్టి బంధింపఁ జూడరే పాప మనక 286

అని యనుకొని ధన్వి యిట నుండి తప్పించుకొని వెడలిపోవు
మార్గమేదాయని యాత్మలో సునిశితముగ విచారించుచుండ- 287

సైన్యాధ్యక్షుఁడు లేచి తేనికి నమస్కారమ్ము గావించి రా
జన్యానేకపసింహ! జన్యమున కాజ్ఞాపత్రమిప్పింపుఁడా
కన్యారత్నము నొక్కనాఁట నిటఁ జక్కం జేర్పఁగాఁ జాలమే
ధన్యుల్ మెచ్చఁగ నంచుఁ బల్కఁగడుఁ బంతంబొప్ప రా జంతటన్.

కనుఁగొని ధన్వని మారా
కను దెల్పుట నీకుఁ దగిన కర్జము గానం
జను మిఁక రేపట మాపటఁ
జనువెంతుము గన్యఁ గొనఁగ సాహసముననే. 289

అనవుఁడు వాఁడు మ్రానుపడి యాత్మ నొకించుక జంకి మెల్లఁగా
జనవర! యేమి సెప్పుదును సర్వవిధమ్ములఁ జెప్పిచూచితిన్
వినరకటా! విధింపలఁప వేఱుగనున్నదొ పోయివచ్చెదన్
గినుక వహింపకుండుఁ డని కేలుమొగిడ్చి కుసుంభుఁ జేరఁగన్. 290

పుత్రపుత్రికాకళత్రమిత్రాచార్యకులవృద్ధులు పరివేష్టించి
యుండ నతండధిపుఁ గూర్చి యడుగ ధన్వి యిట్లనియె. 291

ఏమని చెప్పువాఁడ వసుధేశ్వరు రాక్షసకృత్యనిర్ణయం
బో మహితాత్మ! వైశ్యులను నుగ్రతరమ్ముగఁ జించిచెండి యీ
కోమలకన్యకామణి సకుంఠితలీలఁ గొనం దలంచినాఁ
డాముని "రామరామ" యని యాడఁడు తత్సభనొక్కఁడేని యున్. 292

మాన్యధనాపహరణదుర్మార్గమందు
రావణుం డందెవేసిన రాక్షసుఁ డని
యిందనుక చెప్పుకొనుచుందు రెల్ల జనులు
వానినే చంపి పుట్టిన వాఁ డితఁడు. 293

కత్తుల కటారులా మన
మెత్తెఱఁగున వాని నోర్తు మెది మార్గము? భూ
భృత్తని బత్తిం గొల్వఁగఁ
గుత్తుకలను నుత్తరించు కూ్రరుండయ్యెన్. 294

ఒండు రెండు దినాలలో దండు వచ్చి
మనల మట్టాడి వాసవిఁ గొనుట నిజము
చేయఁదగు కృత్య మెద్దియో చెప్పఁడనినఁ
గడకఁ గన్యక జనకుతో నొడివె నిట్లు. 295

తనకత్తి కెదురు లేదని
మన మీఁదికి వచ్చుచుండె మనుజాధీశుం
డెనలేని కీడు పొందక
చనునే యవ్వాని యాట సాగునె కనుఁడీ. 296

చింతింపం బనిలేదు శాశ్వత యశశ్శ్రీగల్గి వెల్గొంద నా
యంతర్వాణి వచించు చున్నదొక సత్యంబైన సందేశ మ
త్యంతానందముమె హరుం దలఁచు చే నగ్నిం బ్రవేశించి సా
ధింతున్ భారతవీరనారి యన వర్తింతున్ సురల్ మెచ్చగన్. 297

కక్ష విరూపాక్షుం దను
భిక్షువులుగఁ జూడఁ గనలి భీకర లీలన్
దక్షాధ్వరమున కరిగిన
దాక్షాయణి యోగవహ్ని దగ్ధముగాదే. 298

దానికిఁ బ్రతిఫలంబుగ దక్షుఁడపుడ
పట్టపాట్లెవ్వఁడైనను బడెనె మంచి
వారి కవమానము నుగూర్చు వార లమిత
ఘోర నరకంబునం బడి కుములఁ గలరు. 299

అతి నిరంకుశ పరిపాలనాధికారు
లైన నృపులకు గుణపాఠమగును గాక!
ప్రాణమానములందొగి మానమె కడు
మాన్యతం మంచు జనతతి మనుటలెస్స. 300

కులగిరులు కుర్రంగిపోయిన
జలజాప్తుఁడు చల్లవడిన జలధి యిగిరినం
జలివెల్గు వెచ్చనైనను
నిల పగిలిన నాత్మవాణి వృధకాదింకన్. 301

తలవాల్చిరి తలిదండ్రులు
జలజల కన్నీటి కాల్వ జాల్వారఁగ ని
శ్చలచిత్తులకే బిడ్డకుఁ
గలయాపదఁ జూచి గుండె గరఁగుట యరుదే? 302

ఊరమ్మ గన్న బిడ్డలు
తేరగఁ బడి యుందు రనుచు వేచిరి గొట్టై
కోరి పెడదిరిగినంతన
కారాల్మిరియాలు నూరగాఁ బాడి యొకో. 303

ఏటికి జైత్రయాత్ర కయి యేగిన రా జిటు వచ్చె వచ్చెఁబో
నేటికి గ్రామవృద్ధు లమితేచ్ఛను బిల్చిరి పిల్వఁ జెల్వగా
నేటికి వచ్చె నిచ్చటికి నీ యమ నేటికిఁ గాంచెఁ గాంచి తా
నేటికిఁ గోరెఁ దీ రెఱుఁగకే విధి యెంతకుఁ జాలి యుండదే? 304

అడిగిన యట్లొసంగఁ గుల మంతయు మమ్ము బహిష్కరించు మే
మిడనియెడన్ నృపుం డిపుడ యేచి హుటాహుటి వచ్చి యుప్పరిం
గొడవ యొనర్చు ముందుఁ గన గోయియు వెన్కనునూయి యిట్టిటన్
సడి వడుకంటెఁ జచ్చుటది సర్వవిధంబుల మేలె యౌఁగదా! 305

అని బోరున నేడ్చుచున్న కుసుమాంబను గని సాంత్వన
వాక్యంబులఁ గొంత స్థిమితపఱచి కుసుంభుం డాచార్యు నవలోకించి-

ఆత్మసంయమనైకవిద్యాప్రవీణ
పరమహంసాగ్రగణ్యనీపాదపద్మ
సేవ సంసృతిజలనిధినావ యనుచుఁ
బూర్ణముగ నమ్మినారము బుధవరేణ్య! 307

గంతవ్యమార్గమేదో
సుంతైనను బోధపడక సూరివరా ప్ర
శ్రాంతుగా ధర్మము సత్యము
శాంతమ్మగు త్రోవఁ దెలుపు సరగున ననగన్. 308

సముచితసమయోచితపథ
సుమహితగతి మతి దలంచు సుమనోగ్రణి యా
విమలాత్ముఁడు భాస్కరుఁ డా
క్రమ మెల్లం దివ్యదృష్టిఁ గని యిట్లనియెన్. 309

ఒడయఁ డెవండు కాని యమితోగ్రనిరంకుశశాసనం బెటుల్
నడచును వీనికంతటికి నాయకుఁ డెవ్వఁడు తత్ప్రభావమున్
గడవగలాఁడె యెవ్వఁడును గర్మవశంవదు లౌట తప్పకీ
పుడమిని సర్వజీవులకుఁ బుట్టుట గిట్టుట నైజ మౌఁగదా! 310

అదియొక చక్రపుంభ్రమణ మా సుడిగుండము నుండి తప్పుకో
నెదఁ దలపోయువారలకు నేదియొ పట్టులభించు నద్దియే
యదనని దాని వీడక మహాత్ముల త్రోవ గమించిరేని పాం
దుదు రపవర్గదుర్గమును దుఃఖము దూరము సేయుఁడీ వెసన్. 311

అని పలుకుచుఁ దలయూఁచె — 312

ఊఁచి యేదిదగునొ తులఁదూఁచి చూచి
యామె కారణజన్మగాఁ నాత్మఁ దలఁచి
కన్య కడఁకకు దిరుగెద్ది కనపడ దనఁ
గడకు విధిలేక దానికే గడగి రంత 313

ఎక్కటి నీమె యగ్గిఁజొఱ నీక్రియ తన్నృపుసేగి నీగఁగా
టక్కరిసేఁత యంచొగి హుటాహుటి సైన్యసమేతుఁడై పురం
బెక్కుడఁ జూ[illegible] దానయయి యీర్ష్యఁ గఠోరకుఠారధారలన్
ముక్కలుసేయఁడాయఁ గల మూర్ఖుఁడు కామికి నిల్కడుండునే? 314

అగ్నికీల వాసవి యట్లు దుముకు
వార లుండుఁడు తక్కినవార లూరు
వెడలి పొండని చాటుచే విధియని వెసఁ
బలెక్కె నొక వృద్ధుఁ డొదవిన పౌరుషమున 315

అందులకందఱు సరియని
సందేహములేక యట్లు చాటింపఁ బురం
బందునఁ గొందఱు విని యది
కుందిరి డెందములఁ దనువు కూరిమి మీఱన్. 316

కులమెల్ల వ్యాకులమ్మయి
యుల బలమున నిండ్లువిడిచి యరుగుట యెపుడేఁ
గలిగెనె? యీ పెడబుద్ధికి
ఫలమెట్టిది పొందఁ గలఁడొ పార్థివుఁ డనుచున్. 317

కొంతసేపు విష్ణువర్ధనుని దూషించి, కృతయుగమ్మున రేణుక, త్రేతాయుగమ్మున సీత, ద్వాపరయుగంబున ద్రౌపది, కలియుగమ్మునఁ గన్యక మ్మాన్య దేవతలుగఁ బుట్టిరేమో య కొందఱాడు చుండిరి. మఱికొందఱు రాజపక్షము చేరి నిర్దోషులమని నచ్చఁజెప్పి వారిసేనల మంచిచేసికొని యిట నివసించుటయే లగ్గనుకొనిరి. ఇంకఁ గొందఱు ప్రాణముండిన బలుసాకుఁదిని బ్రతుకవచ్చు. త్వరితగతిం బాఱిపోవుదమని తలంచిరి. అభిజనము దుస్త్యాజముగానఁ దలకొక మాటగాఁ బలుకఁజొచ్చిరి. కడకు వీరకంకణధారులు తప్ప తక్కిన వారందఱు పురంబు విడిచిపోవ నిశ్చయించుకొనిరి. 318

మసలక ప్రాణభీతిఁ దగుమాత్రము వస్తుల నాలుబిడ్డలన్
వెస నిశి వెంటఁదీసికొని వేయివిధాల విధిం దలంచుచున్
గసిమెయి నేగు వోఁ గలఁగి కన్యక కొందఱు గొల్లపల్లెలో
మసలము వోలెఁ బుట్టె మన ముప్పున కంచపు వాడి రాత్రులై. 319

కొందఱు పశ్చిమదిగ్భాగంబున కేఁగి దిక్కు దెలియక నేక కులములం దైక్యమైరి. మఱికొందఱు ప్రాగ్దిశంబట్టిచని తురాషులని దూషింపఁబడిరి. ఇంకం గొందఱు దక్షిణదేశంబులకరిగి గోవులని పేరొందిరి. ఇఁకఁ గొందఱుత్తర దిక్కునకు వెడలి పరదులని పిలువఁబడిరి. ఇట్లనేకదిశలకుఁ బ్రాణభీతిచేఁ బరుగిడిపోయిన వారి దుస్థితి యెంతని వర్ణింపఁగలము. ఆహా! దుర్మార్గుడైన రాజగ్నిపర్వతమువలెఁ బ్రజలకెప్పుడే యాపదలఁ గలిగించునో గదా! నాఁడధికారధురహంకారమునఁ గలుగుచున్న మహోపద్రవమును జూచి భాస్కరాచార్యుని మనస్సువోలె బాలభానుని మనమ్ముగూడఁ గ్రోధపూరితమైనది కాఁబోలుం దీక్ష్ణారుణ కిరణప్రకరణములతోఁ జుఱచుఱఁ జూచుచునుదయించినాఁడు. అత్తఱినేకోత్తర శతగోత్రముల వారు వాసవీకన్యతోఁ బాటగ్నింబ్రవేశింపఁ గృతనిశ్చయులైరి. పసుపుం గుంకుమలతో వివిధపుష్పములతో బూజింపఁబడిన వీర కంకణములను గురువరుండు వారల కరంబులకుఁ గట్టించె. 320

తఱియుంచుం దనవారిఁగూడి శుచియై దాక్షాయణీజాని సు
స్థిర భక్తిం జిర రక్తిఁగొల్చి తఱియున్ శ్రీగంధ కాష్ఠాగ్ని చె
చ్చెఱ నాజ్యంబున రేఁగఁ గీల లలమన్ శీఘ్రంబ యక్కన్య యం
దఱు వేష్టింప నమశ్శివాయ యనుచుం దా దూఁకె నయ్యగ్నిలో. 321

కన్నియ దుముకం బోవుచుఁ
గన్నెఱ్ఱఁగఁ జేసి చూచి క్రన్నన శతధా
భిన్నమగు నృపుని తల యనె
తన్నగరింగల ప్రజాళి తన్ను నుతింపన్. 322

ఇట నిటు జరిగెడి తఱి నట
నిటలాక్షుని గెల్చి యైన నిశ్చింతముగాఁ
గుటిలాలకఁ దెచ్చెదనని
దిట వొప్పఁగ నృపుఁడు బయలుదేరెం గడఁకన్. 323

మింట మెఱసెడి పెక్కెము మీఁద వ్రాలి
గూబ గూబలు వగులంగఁ గూసి చనియె
నెదురఁ గుక్క మోరెత్తి యేడ్చుచుండ
నూర్ధ్వముఖముగ గోమాయు వూళవెట్టె. 324

సాధ్యాసాధ్యమ్ములవై
విధ్యార్థము తెలుఁగ లేమి విరసతఁ జనుదే
వధ్యుండా పృథ్వీపతి
మధ్యేమార్గమున నట్ల మరణించె వెసన్. 325

అట్లు విష్ణువర్ధనుండు విగతజీవుండై తత్క్షణంబ చిత్రకంఠుఁ డను గంధర్వరూపంబు ధరించి దివంబున కరిగె. ఇంకిట యోగాగ్ని నడుమనున్న సతీదేవి చందంబున నాత్మశక్తిచే నొప్పారి వాసవీకన్య-

ఏ పేట నన్నుఁగొల్చు కి
రాటుల కైశ్వర్య మిడుచు రక్షించెద ని
వ్వీట మదీయాలయమున
హాటక విగ్రహము నిల్పి యర్చింపుఁ డనెన్. 327

పుత్తడిబొమ్మ యట్ల తమపొంత దిగంత నితాంత కాంతిమై
నత్తఱి బగ్గుబగ్గుమను నగ్గిని నిగ్గులు దేలు వాసవీ
చిత్త మహత్తసాధ్యమని శీర్షము లెల్లరు వంచి మ్రొక్క నా
సత్తి దరిన్ వెలింగె సుర సంఘము గొల్వఁగ మిత్తిగొంగయున్. 328

బంధువులె యాపదలఁ దోడుపడుచు నుండ
భార్య భర్తసాహాయ్యమ్ము పడయు టరుదె
యగ్నిభగ్నాష్టమూర్తుల యందొకండు
గాన, సత్యంశజాతకు హాని కలదె? 329

అపుడు నందియు జనుదెంచె నతి రయమున
నంత శివలీల వాసవి యార్యగాగ
వాహనంబెక్కి రిర్వురు; వైశ్యవరులు
వీరకంకణధారు లావేశ పడుచు. 330

వరుస నూటొక్క గోత్రాలవారు దుముక
దేవ దుందుభుల్ మ్రోగఁగా దివ్యకుసుమ
వృష్టి కురియఁ గైలాస పారిషద యుక్త
నవ్య మణిమయ దేవయానములు వచ్చె- 331

అగ్నిఁజొచ్చిన ధీరు లత్యద్భుతముగ
దివ్యదేహులై వెస వేల్పు తేరులెక్కి
చనిరి గౌరీశ్వరులతోఁ బ్రశాంత దివిజ
భాసమాన విలాస కైలాస గిరికి. 332

నాఁడు రజతాద్రి రమణీయరత్నభూషణములచేఁ గ్రాంగొత్త కాంతులతో మిలమిల వెలుఁగుచుండె. భస్మకుంకుమరుద్రాక్షమాలాలంకృతులై ప్రమథగణ మత్యంత భక్తి భావములతో నవనతశిరస్కులై సర్వేశ్వరుని సేవింప ద్వారముకడ వేచియుండిరి. కనుబొమ్మల చలనమాత్రమునఁ బ్రభు నాజ్ఞ నెఱుంగఁ గల నంది కాంచనవేత్రధరుండై ప్రాంగణమున నిలిచి వలు వలంకులఁ గలయం గనుంగొనుచు నిజదృష్టిప్రసరణమాత్రమునఁ దత్ప్రాంత మంతయు శాంతపావనగంభీరముగా నొనర్చుచుండె. జటాజినదండకమండలధారులై దివ్యర్షు లరుదెంచుచుండిరి. మహాదేవు నెదుట గంధర్వులు గానముసేయుటకు, నచ్చరలు హల్లీసకాదిమనోహరనృత్యము లొనర్చుటకు నలంకరించుకొనుచుండిరి. పారుటాకులు పాలపూసలు ధరించి గుత్తులు గుత్తులుగాఁ బడియున్న ముత్తెములఁ గమనించుచుఁ గిరాతవరులు కడుంగడు దూరమున నత్యద్భుతచాతుర్యమున సింహములవేటలాడుచుండిరి. చెంచెత లమితప్రీతితోఁ బండ్లు చాఱపప్పు తేనె పరమశివున కర్పింపవలయు నని సమకూర్చుకొనుచుండిరి. తద్గిరివరశృంగరాజములు మహేశ్వరు మహిమల వేనోళ్ళఁ జాటుచున్నట్లు ధగధగ మెఱయుచుండె. మానససరోవరవికసితపుష్ప సౌరభమును బులుముకొని మందమలయానిలుఁ డానందకరముగ వీచుచుండె. సప్తర్షులు సభార్యులై శ్రుతిహితనాదములతో శివపూజార్థము బయలుదేరి వెండికొండ సానువుంజేరిరి. వియచ్చరుల గొంద అందంద తమ విమానముల దింపుకొని విశ్వేశ్వరుని సందర్శింపఁ బాదచారులై వచ్చుచుండిరి. మహాయోగిమనస్సువలె నాకసము నిర్మలముగానుండె. నారదుఁడు నిజకంఠస్వరము మహతీనాదముతో మేళవించి తన గానామృతమున మోడులు సైతము చిగుర్చునట్లు శివగీతములు పాడుచు మిత్రబృందముతో నంతరాళమున యోగశక్తిం గైలాసగిరికి వచ్చియుండె. విష్ణు బ్రహ్మేంద్రాదులు పరమేశ్వరుని బ్రస్తుతింప విచ్చేసిరి ఇట్లు మహామహులచేఁ బరివేష్టింపఁబడియున్న యన్నగరాజము చూపఱ కత్యంతనేత్రోత్సాహకరముగ నుండె. అంతం గానకళాలోలుండగు నద్దేవర్షి — ౩౩౩

ఓ సర్వేశ్వర చంద్రశేఖర హరా యో సాధుసంపత్కరా
యో సంసారతమచ్ఛటాఖరకరా యో భక్తరక్షాపరా
యో సత్యార్థగుహావిహారవిమలా యోంకారరూపోజ్జ్వలా
నీ సేసామృతపానచిత్తులము తండ్రీ! మమ్ము రక్షింపవే. 334

సకలసౌఖ్యప్రదాయిని శంభురాణి
పరమపావని శర్వాణి భక్తజనని
త్వత్పదాబ్జాతములకు వందనముతల్లి
కంటికిన్ ఱెప్పవలె మమ్ముఁగావవమ్మ. 335

అని గౌరీశంకరుల స్తుతించి సుహృద్వర పరివృతుండై యొక్క దేవదారువృక్షచ్ఛాయకుం జని యటఁ గూర్చుండి యుండ నందొక్కరుఁడు వాసవీ కన్యా పూర్వజన్మవృత్తాంత మేమి యని ప్రశ్నింపఁ బూర్వము సాలంకాయనుఁడు కిరాటమునిబృందమునకుఁ జెప్పిన కథ నేను మీకుఁజెప్పెద నాలింపుఁ డని యిట్లు నుడువం దొడంగె. 336

సిరులు చెన్నులరారఁగాఁ జిత్రకంఠుఁ
డనెడి గంధర్వుఁ డిటఁ బూర్వ మధివసించు
నాతఁ డొకనాఁడు శివదర్శ నార్థియగుచు
వచ్చుచుండెను సద్భక్తి పిచ్చలింప. 337

పూల తీఁగల నడుమఁ దాఁ బూలతీఁగ
యో యనఁగ సంచరించుచు నున్నదాని
నందచందాల రాణి నా నలరుదాని
సోమకాంతమునీంద్రుని సుతను గనియె. 338

కాంచినయంత మారశరఘాతములన్ సహియింపలేక తాఁ
బంచముఖున్ భజింపక యపారవిమోహమహాబ్ధి మున్గి య
క్కాంచనగర్భు కౌశల మఖండముగా నుతియించుచున్ సమీ
పించినఁ గీర్తికన్య కని వేగమ యాత్మగృహంబుఁ జేరఁగన్. 339

అతఁడు వదలక యామె వెన్నంటి పోయి
కన్య తలిదండ్రులం గాంచి కరుణతోడ
నాకొసఁగి పెండ్లిసేయుఁడు నామనస్సు
మీతనూజాత నెంతొ ప్రేమించియుండె. 340

అని పలుక సోమకాంతుఁ డేమందు మనుచుఁ
కొంత చింతించి యతనితో గొడవ యేల
యనుచు మాపెద్దలకుఁ జెప్పి యవలఁ జేయఁ
దగిన రీతిగఁ జేసెదఁ దథ్య మనియె. 341

వారల నొప్పించి వెనక్
వారక నీకిత్తుఁ బిదప వారిజనేత్రం
గోరి యరుదెంచినాఁడవు
ధీరాగ్రణి నీకు వేఱ తెలుపఁగ నేలా. 342

అని సాకు సెప్పి పంపినఁ
దన మనమున మాటవల్కి తప్పటంచున్
వినయమున సంతసంబున
ననుకొనుచును వెడలిపోయె నాతం డంతన్. 343

ఎవ్వాఁడు వీఁడు కన్యఁ గని యేటికి వచ్చెను సాహసించి న
న్నివ్విధిఁ దానుగా నడుగు టెంతయు నొప్పునె వీని కియ్యెడం
గ్రొవ్వున వచ్చెఁగాక యిది కోవిదు లెవ్వరు మెచ్చుకొందు రే
నవ్వులపాలు గావలసినాఁడు సుమా యిఁక మాటలేటికిన్. 344

ఏమైన నగును గానీ
కోమల మాకన్య నీయఁగూడదు రానీ
సామమునఁ జెప్పి పంపెదఁ
గామాంధుఁడు వానితోడఁ గయ్యం బేలా. 345

అని నిర్ణయించుకొన్నవాఁడై సోమకాంతుం డేతద్వృత్తాంత మును పుత్రమిత్రకళత్రాదులకుఁ జెప్ప వారును నదియ లెస్స యని పల్కిరి. ఇది యిట్లుండ నట చిత్రకంఠుఁడు శ్రీకన్యకావ్యామోహ పీడితుండై దిన మొక్క యుగంబుగఁ గడపుచు 346

ఇన్నినాళ్ళయ్యె నేవచ్చి కన్నెఁ గూర్చి
కబురు రావయ్యె నెయ్యది కారణంబొ
యింక జాగేల యేఁ జని శంక మాని
చక్కఁగాఁ దెల్పుకొని వత్తు సత్వరముగ. 347

అని చనుదెంచి యిచ్చకము లాడి పదంపడి యాత్మవృత్తముఁ
ఘనముగఁ జెప్ప తప్ప కిఁకఁ గన్య నొసంగు మటంచుఁ గోరఁగా
విని విని సోమకాంతుఁ డల పెద్దల కద్ది మతంబు గా దనన్
వినయవివేకదూరుఁ డయి వేగమ కన్నులు జేవురింపఁగన్. 348

తొలుత సుత నిత్తు నంచీవు పలికి నాకు
నాసఁ గలిగించి తెంతయో యాదరమునఁ
దిరిగి యీనాఁడు వచ్చిన ధీరుఁడ వయి
యీయనని వల్కఁ గా నీకు న్యాయ మగునె. 349

నన్నింత మోసము చేసితివి గాన బంధుమిత్రపుత్రపుత్రికా కళత్ర సమేతముగా నీవు భూలోకమున జన్మించి నొక్క భూపాలుని వాంఛాకారణంబున నగ్గింబడి మరణింతువు గాక యని శపించిన సోమకాంతుం డాజ్యంబుఁ బోసిన యగ్ని చందంబున మండిపడుచు "ఓరీ! యజ్ఞానీ! మోహాంధకారమ్మునఁ గన్నుగానక మమ్మిట్లనవసరముగ శపించితివి గాన నీవును మర్త్యభువనంబునఁ దద్రాజన్యుఁడవై పుట్టి యీతత్ఫలితమనుభవింతువుగాక యని ప్రతిశాపంబిచ్చె. ఆసోమకాంతుఁడు కుసుమసెట్టిగాఁ దద్భార్యయే కుసుమాంబగాఁ గీర్తికన్య కీర్తికన్యగాఁ జిత్రకంఠుఁ డను గంధర్వుఁడు విష్ణువర్ధనుఁడుగా మనుష్యలోకంబునఁ బుట్టి నేటికి శాపవిమోచనములు గలుగఁగా నందఱుఁ గైలాసమునకు వచ్చి సుఖంబుండిరి.

బృహాద్గిరిపురమునఁ గుసుమసెట్టి కుమారుఁ డగు విరూపాక్షుఁడును దద్వంశ్యులును గన్యక పార్వతీదేవి యవతారమని సంపూర్ణముగ విశ్వసించి కన్యకాపరమేశ్వరి యను నాలయముఁ గట్టించి నిత్యమును బూజించుచు సంతోషముగఁ గాలము గడపుచుండిరి. 350

ఈకథ వ్రాసినఁ జదివిన
సాకల్యము వినిన సకల సంపద లమరుం
గాకని సంతోషంబున
నాకౌకసు లపుడు వినఁగ నారదుఁ డాడెఁ. 351

## గద్యము

ఇది శ్రీమద్గౌరీశంకర వరప్రసాద లబ్ధ సహజ
చతుర్విధ కవితా కలా విలాస సాహితీ రసవికాస
సంస్కృతాంధ్రాది బహుభాషా గభీరమనోహర
భావ బంధురమహోల్లాసభాస బండ్లపిచ్చమ్మా
పిచ్చయామాత్య పౌత్ర యాదమాంబ
వేంకటసుబ్బయార్య జ్యేష్ఠపుత్ర
యన్నపూర్ణా సావిత్రీ కళత్ర
సుహృజ్జన సువిధేయ
సుబ్రహ్మణ్యనామధేయ ప్రణీత
శ్రీ కన్యకాపరమేశ్వరీచరిత్ర
సంపూర్ణము

CC-NO.
29

# తప్పొప్పుల పట్టిక

| పద్య సంఖ్య— | తప్పు— | ఒప్పు— |
|---|---|---|
| 73 | పురాధి | పురాధి |
| 81 | దృష్త్రలెరి | దృష్త్రలైరి |
| 139 | సంచెదర౯ | సంచెదర౯ |
| 141 | పథ | పథ |
| 187 | జవచావోఁసు | కవచశిత |
| 230 | బ[illegible]ధము | బంధంబు |
| ,, | [illegible] | [illegible] |
| 234 | [illegible] | నాఁడు |
| 276 | [illegible] | నాడ౯ |
| 280 | [illegible] | భిత్కృద్గ |
| 281 | పైచాచ | పైశాచ |
| ,, | జోగ్గొట్టు | జోక్గొట్టు |
| ,, | నెల్లయు | నెల్లను |
| 360 | జేష్ఠ | జ్యేష్ఠ |